తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

డిసెంబరు 2017 వెల రూ.5/-



మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః ।
రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిః తథైవ చ ॥

# మీ మాట

### భక్తిదాయకం!!

అక్టోబరు సంచిక భక్తిదాయకంగా ఉంది. దివ్య పురాణగాథావళి 'దీపావళి', కేదార గౌరీవ్రతం, కదలి- శ్రీకపోతేశ్వరాలయం, నాగులచవితి, కార్తికదీపాల ఆనందహేల మొదలగు వ్యాసాలతో భక్తిదాయకంగా ఉంది. అవి మనసు దోచుకున్నాయి..

*- భాగ్యశ్రీ రాజేష్, పొన్నల్.*

### ఆకర్షణీయం!

అక్టోబరు సంచిక 'శ్రీవారిఆలయంలో దీపావళి ఆస్థానం' భక్తిదాయకంగాఉంది. అందమైనబొమ్మలతో కూడిన వ్యాసాలు మమ్మల్నెంతో ఆకట్టుకుంటున్నాయి.

*- బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్.*

## 2018 జనవరి నెల ముఖ్యమైన పండుగలు

- 01 ఆంగ్లవత్సరాది
- 03 తిరుమల శ్రీవారి సన్నిధిన ప్రణయకలహ మహోత్సవము
- 07 ఆండాళ్ నీరాట్టోత్సవ ప్రారంభం
- 12 సర్వ ఏకాదశి
- 13 శ్రీ ఆండాళ్ నీరాట్టోత్సవ సమాప్తి
- 14 భోగిపండుగ
- 15 సంక్రాంతి పండుగ
- 16 కనుమపండుగ,
  శ్రీపురందరదాసుల ఆరాధన మహోత్సవం,
  శ్రీ గోదా పరిణయోత్సవం,
  తిరుమల శ్రీవారు పార్వేటమండపంలోకి వేంచేయుట
- 18 దేవుని కడప శ్రీలక్ష్మీవేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవ ప్రారంభం
- 24 రథసప్తమి,
  భీష్మాష్టమి
- 26 భారత గణతంత్ర దినోత్సవం
- 31 శ్రీరామకృష్ణతీర్థ ముక్కోటి

### సద్వినియోగం

ప్రతినెలా 'సప్తగిరి' మాసపత్రిక ఆధ్యాత్మిక విశేషాలతో అలరిస్తుంది, మాకు తెలియని ఎన్నో విషయాలను ప్రతినెలా తెల్సుకుంటున్నాము, ముఖ్యంగా అక్టోబరు-2017 సంచికలో శ్రీవారి పవిత్రోత్సవాల దృశ్య మాలిక అత్యద్భుతంగా ఉంది.

అలాగే దివ్యపురాణగాథావళి 'దీపావళి' పండుగ విశిష్టత, ప్రాముఖ్యత చదివి తెలుసుకుని మా పిల్లలకు కూడా అర్థమయ్యే విధంగా చెప్పాం. ప్రతిపేజి క్రింద మీరు ప్రచురిస్తున్న నీతివాక్యాలు పాఠకులకు సద్వినియోగం అవుతాయి.

'ఊరకే దొరుకునా ఉన్నతోన్నత సుఖము?' అన్న మయ్య సంకీర్తన ప్రస్తుత యువతకు చక్కటి మార్గదర్శకంగా ఉంది. ఇలాంటివి (మార్గదర్శకంగా / ఆచరించదగ్గవిగా) ప్రతినెలా ప్రచురించగలరు, బాగ్‌సవారి ఉత్సవం ప్రాధాన్యతను తెలుసుకున్నాం. 'కార్తికదీపాల ఆనందహేల' ఫోటో ద్వారా 'కార్తిక దీపాలను కనులారా దర్శించాము'. వ్యాసం బాగుంది.

అక్టోబరు-28 శ్రీవారిపుష్పయాగం సందర్భంగా ప్రచురించిన పుష్పయాగం ఆద్యంతం ఆసక్తికరంగా ఉంది. వెనుక చిత్రం 'పుష్పయాగమహోత్సవం" కడురమ్యంగా ఉంది. ప్రతిఒక్కరూ ఫ్రేమ్ కట్టించి దాచుకోదగ్గ చిత్రం.

*- గుగ్గిలం శ్రీహరి, వేటపాలెం.*

### భక్తిభావనలను....

అక్టోబరు సంచికలో పవిత్రోత్సవ చిత్రాలు నయనానందకరంగానే కాదు, భక్తిస్ఫోరకంగా కూడా ఉన్నాయి. మహానుభావుడు మణవాళ మహాముని వివరాలను నాగ సుదర్శన్‌రావు చక్కగా క్రోడీకరించారు. ఆటల తద్దిని గురించి తమదైన చక్కని వ్యాఖ్యను అందించిన దీక్షితులగారికి అభివందనసుమాలు.

అత్రిమహర్షి ఆదర్శధర్మమూర్తిగా ఎలా రూపుదిద్దుకున్నారో మల్లికార్జునరావు చక్కగా చర్చించారు. డా॥ కంపల్లె రవిచంద్రన్ వ్రాసిన 'కైంకర్యమే తనువు దాల్చితే' భక్తిభావనలను పాఠకులలో ఉద్దీపన చేసింది.

*- డా॥ శివభూషణం, కర్నూలు.*

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 48 డిసెంబరు, 2017 సంచిక : 07



వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి ॥


**గౌరవ సంపాదకుడు**
శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ, ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

**సంపాదకుడు**
డా॥ వి.జి.చొక్కలింగం, ఎం.ఏ., పిహెచ్.డి.,

**ఉపసంపాదకుడు**
డా॥ కంపల్లె రవిచంద్రన్,
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

**ముద్రాపకుడు**
డా॥ టి. రవి, ఎం.ఏ., పిహెచ్.డి.,
పౌరసంబంధాధికారి, తి.తి.దే., తిరుపతి &
ఉపకార్యనిర్వహణాధికారి
(ప్రచురణలు & ముద్రణాలయం) ఎఫ్.ఏ.సి., తి.తి.దే., తిరుపతి

**చిత్రకారుడు**
శ్రీ పి.శివప్రసాద్, తి.తి.దే., తిరుపతి.

**ఫోటోలు**
శ్రీ పి.ఎన్.శేఖర్, ఫోటోగ్రాఫర్, తి.తి.దే.
శ్రీ బి.వెంకట్రమణ, సహాయఫోటోగ్రాఫర్, తి.తి.దే.,

సప్తగిరి మాస పత్రిక

ఇతర వివరాలకు
0877-2264543

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-


## ఈ సంచికలో...



ముఖచిత్రం : అన్నియు నీవే హరి పుండరీకాక్ష!
వెనుక చిత్రం : శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే!!
- మెహంది(గోరింటాకు) చిత్రకారుడు : శ్రీ ఎ.ఎస్.హేమంతబాబు, తి.తి.దే.

## సంపాదకీయం

# ఆండాళ్ భక్తితన్మయత!

ఆండాళ్ తన పరమభక్తిపరవశంతో భగవంతుణ్ణే వరించి, ధన్యురాలయింది. ఆమె గానం చేసిన పాశురాలలో ఆమె దివ్యప్రేమ ప్రతిఫలిస్తూంది.

ఆండాళ్ భగవంతునియందు ప్రేమోన్మత్త అయిన దుఃఖిత. ఎలాగైనా స్వామికి దగ్గరకావాలి. తమ సమాగమాన్ని శాశ్వతం చేసుకోవాలి – ఇదే ఆమె ఆశయం.

"తెల్లని శంఖం ధరించి తిరిగే నల్లనయ్య నను కానరాడే! నామనసు దోచుకొని నన్నే కారియ పెడుతున్నాడే! నా సర్వస్వం ఆయనే కోయిలా! గొణగకే! కూయవే శ్రావ్యంగా! అరుదెంచే నా నాథునికై హాయిగా పాడవే!" – అంటూ కోయిలను అర్థించింది.

ఎట్టకేలకు ఆమెను స్వీకరించడానికి స్వామి అంగీకరించాడు. కానీ ఆమెతండ్రి పెళ్లి ఏర్పాట్లు చేయాలి. ఇంత అలౌకికంగా తన ముద్దుబిడ్డను ఆయన ఎలా పంపించేస్తాడు? దైవంనుండి వస్తున్న ఆ ఒత్తిడికి తత్కాలంగా ఉపేక్షిస్తూ సమయాన్ని దాటవేస్తున్నాడు. ఇక్కడ ఆండాళ్ ఆలస్యాన్ని భరించలేకుండా ఉంది. నెచ్చెలితో స్వామికి దౌత్యం నెరపుతోంది.

పదకొండుపాశురాలున్న ఒక గీతంలో ఆండాళ్ తన సుందరస్వప్నాన్ని వర్ణించింది. అందులో స్వామితో తన కల్యాణాన్నీ, ఒక్కొక్క వేడుకనూ ఎంతో విశదంగా భావనాపటిమతో చక్కగా వివరించింది. ఆ పాశురాలు వింటుంటే ఆ పెండ్లి భావనాహృదయంలో దర్శనీయమై ఉంటుంది. దక్షిణాదిన ఈ సన్నివేశం ఎంతో ప్రచారం పొందింది. పెళ్లిళ్లలో ఆ 'వారణ మాయిరం' పాటలను పాడుకొనటం ఇప్పటికీ సంప్రదాయంగా ఉంది. దివ్యప్రేమ విషయంలో నేటికీ ఆండాళ్ ప్రేమే పరాకాష్ఠ! కవితావాస్తవికత కోసం సరసాలు, పరాచికాలు ఆ గీతాలలో చోటు చేసుకొన్నాయి.

ఆండాళ్ రచన తిరుప్పావై, దానికదే సాటి. అందులో 30 పాశురాలున్నాయి. ఒక్కొక్క దానిలో 8 పంక్తులుంటాయి. కొంతమంది కన్యలు ఇంటింటికీ తిరుగుతూ తమ తోటివారిని పెందలకడనే మేలుకొమ్మనీ, స్నానం చేయమనీ అడగటం అందులో నాటకీయంగా వర్ణితమైంది. ఇది తమిళనాడులో వందలయేళ్లుగా ఉంటున్న ఆచారమే. పల్లెపిల్లలు శీతాకాలంలో కూడా చీకటితోనే లేచి స్నానం చేసి, శుచిగా దేవుణ్ణి ప్రార్థిస్తారు – తమకు మంచిభర్త దొరకాలని.

ఆండాళ్ తన చిన్నతనం నుండే శ్రీకృష్ణుని పట్ల ప్రేమలో మునిగి తేలుతోంది. శ్రీకృష్ణుని బాల్యంలో తనూ ఒక గోపికనని ఆమె భావించుకునేది. విష్ణుచిత్తుని ఇంటిని యాదవరాజ్యమనుకొనేది. ఆమె భావనలలో విల్లిపుత్తూరు ఆలయంలోని స్వామి సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మే! ఆండాళ్నాడు యాదవకన్యలు జరిపిన ఉత్సవాన్ని మానసికంగా తానే జరిపినట్లు ఊహించుకుని, తన అనుభూతిని గీతాలుగా అక్షరబద్ధం చేసింది. అలాంటి కవితలు తిరుప్పావైలో కనిపిస్తాయి. వానిలోని భాష లలితం, సుందరం, సంగీతవిహితం. గడచిన యుగకాలాన్ని గుర్తుకు తెచ్చే మనశ్చిత్రాలతో నిండి ఉంటుంది.

పనికిమాలిన కోరికలన్నీ తుడిచేసుకొంది, ఆండాళ్! ఆడంబరాల్ని అధిగమించింది. ఆత్మరాజ్యంలోకి ఆనందంలో తేలుతూ వెళ్లింది. ఆమె నాయికా-నాయక భావచిత్రణ అద్భుతం. ఆమె అధ్యాత్మగవేషణ నిరుపమానం. లక్ష్యసాధనకు ఆమె పట్టుదల అభినందనీయం. అందుకే, తమిళ కవిత్వరంగంలో ఆమెస్థానం ఎంతో ఘనమైంది, విలక్షణమైంది, లక్షలాది భక్తుల హృదయాలలో కలకాలం నిలిచేది.

విష్ణువంటే విశ్వంగా ఉన్న పరమాత్మ-సర్వవ్యాపకుడు. భారతయుద్ధం పూర్తి అయిన తర్వాత అంపశయ్యపై ఉన్న భీష్మునిద్వారా సకలధర్మరహస్యాలు విన్న తర్వాత ధర్మరాజు అతణ్ణి అడిగిన ప్రశ్నలివి.

1) కలియుగంలో ఎవరిని జపించడంచేత మానవులకు జన్మసంసారబంధాలు తొలగిపోతాయి?

2) అన్నిధర్మాల్లో పరమధర్మమేది?

3) ఎవరిని పూజిస్తే మానవులు శుభాలతో జీవిస్తారు?

ఇందులో... మొదటిది, సృష్టింపబడిన జీవితిరిగి సృష్టించక ఎట్లా ముక్తి పొందుతుంది? రకరకాల దైవావతారాల్లో ఎవరిని జపిస్తే జీవి చివరకు ముక్తిపొందుతాడు?

రెండోది, అన్నిధర్మాలను నడిపించే అసలైన ధర్మ స్వరూపం ఏమిటి?

మూడోది, ఈ జీవి జీవచైతన్యంలో భూమ్మీద అందంగా జీవించడానికి ఎవర్ని పూజించాలి?

ఇవన్నీ కలిస్తే ఆస్తికత్వానికే ఒక పెద్ద ప్రశ్న. అందులో ఈ ప్రశ్న ధర్మరూపుడైన ధర్మరాజుకే కలిగింది. అందుకు సమాధానం ఆ కృష్ణపరమాత్మ తాను ప్రక్కనే ఉండి, తానే రచించిన(వ్యాసావతారంగా) విష్ణుసహస్రనామాలను భక్తశిఖామణి అయిన భీష్ముడితో చెప్పించాడు. తాను స్వయంగా చెప్పిన భగవద్గీతకన్నా తన భక్తుడు చెప్పిన ఈ సమాధానాలే ఆ పురుషోత్తముడికి ప్రియమైనవి. ఆప్రశ్నలకు భీష్ముడి సమాధానాలు - ఇవి.

# విష్ణుస్వరూపం

- డా॥ వి.పళని

'జగత్ప్రభుడును, దేవదేవుడును, అనంతుడును, పురుషోత్తముడును అయిన శ్రీమహావిష్ణువును వెయ్యినామాలతో స్తుతిస్తే జీవులకు శుభం కల్గుతుంది.'

తర్వాత రెండు ప్రశ్నలకు సమాధానమిది. 'ఆద్యంతాలు లేనివాడు, సకలలోకప్రభువు సర్వసాక్షి అయిన దేవుని అనంత దివ్యనామాలను అనుదినం స్తోత్రంచేస్తే మానవుల సర్వదుఃఖాలు నశించి, శుభాలు పొందుతారు.' పరమాత్మ విష్ణుస్వరూపం.

ఆంధ్రభాగవతంలో నారదుడు వ్యాసుడికి విష్ణువును విశ్వరూపుడిగా ఇట్లా చెప్పాడు. విష్ణుండు విశ్వంబు విష్ణునికంటె వేరేమియును లేదు. విశ్వమునకు భవ వృద్ధి లయములు ఆ పరమేశుచే నగు. కావున ఈ విశ్వం విష్ణువుకు ప్రతీకం.

క॥ విను మీ సంసారం బను
వననిధిలో మునిగి కర్మవాంఛలచే వే
దన బొందెడువానికి వి
ష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా

స్వయంగా విష్ణువే నారదునితో చెప్పిన విష్ణుతత్త్వమిది. సంసారసముద్రంలో మునిగి కర్మవాంఛలచే వేదన పొందే వాణ్ణి విష్ణుదేవుని గుణవర్ణనము తెప్పలాగా రక్షిస్తుంది.

విశ్వాత్మ అయిన విష్ణువుయొక్క గుణవర్ణనము సంసార సాగరాన్నుంచీ దరిచేర్చే తెప్పకు ప్రతీకలగా చెప్పబడింది.

## విరాడ్రూపం - విష్ణువు

సర్వత్ర వ్యాపించినవాడు విష్ణువు. ఆద్యంతాలు లేని వాడు. లోకాధ్యక్షుడు లోకసాక్షి. చతుర్వేదాంతర్గతమైన పురుషసూక్తం ఈ విష్ణుని విరాడ్రూపాన్నే, 'సహస్ర శీర్షాపురుషః, సహస్రాక్ష స్సహస్రపాత్' అని వేయితలలూ, వేయిపాదాలు కల్గినట్లు వర్ణిస్తున్నది.



ఇదే విషయాన్ని భగవద్గీత విశ్వరూప సందర్శనయోగం వర్ణిస్తున్నది. "సహస్రం" అంటే అనంతమని సాయణాచార్యులు తమవేద భాష్యంలో తెలియజేశారు. ఆ విరాడ్రూప అనంతుడు సర్వత్రా వ్యాపించిన సృష్టికర్త, అధినేత అయిన విష్ణువుగా తెలుస్తూంది. ఈ విషయాన్నే ఆదిశంకరులు, "గేయం గీతా నామసహస్రం, ధ్యేయం శ్రీపతిరూపమజస్రం" అంటూ భజ గోవిందంలో తెలిపారు. కనుక విరాడ్రూపుడు విష్ణువే అని చెప్పవచ్చును.

ఎఱ్ఱన నృసింహపురాణంలో ప్రహ్లాదుడు తండ్రితో చెప్పిన విష్ణురూపమిది.

**క॥ విష్ణుమయము వేదంబులు**
**విష్ణుమయము సర్గ మఖిల విజ్ఞానములున్**
**విష్ణుమయము జగమంతయు**
**విష్ణుమయము విష్ణు డొకడ వేద్యుడు బుద్ధిన్**

వేదాలు విష్ణుమయం, ఊర్ధ్వలోకాలు, సమస్త విజ్ఞానాలు విష్ణుమయం, జగమంతా విష్ణుమయం, తెలుసుకోదగినవాడు విష్ణువే. వేదాలు, ఊర్ధ్వలోకాలు సమస్తవిజ్ఞానం, సమస్త జగం–ఇవన్నీ విష్ణుస్వరూపం. విష్ణువుస్వరూప ప్రతీకలే! విష్ణురూపం విరాడ్రూపానికి ప్రతీక.

## ప్రణవస్వరూపం - విష్ణువు

సహస్రనామాల్లో మొదటనే విష్ణుతత్త్వం ప్రణవ స్వరూపంగా తెలుపబడింది. వికారరహితుడు, పవిత్రుడు, నిత్యుడు, పరమాత్ముడు సకలరూపాలు తానైనవాడు అయిన విష్ణుదేవుడు, ఎవ్వనిదివ్య నామస్మరణంచేత సంసారబంధాలు, జన్మబంధాలు తొలగిపోతాయో అట్టి ప్రభువైన విష్ణువుకు నమస్కారం.

అవిభాజ్యమైన బ్రహ్మపదార్థమే శ్రీమహావిష్ణువు. కనుక అవికారుడు, అవ్యయ





స్వరూపంతో మార్పుండదు కనుక వికార రహితుడు, అవికారుడైన విష్ణువు నిర్మలుడు, పవిత్రుడు, శుద్ధచైతన్యంవల్ల నిత్యుడుగా కీర్తింపబడుతూ ప్రణవరూపమైన ఓంకారలక్షణాలు కల్గి ఉన్నాడు.

### విష్ణువు నీలవర్ణం - కనిపించనివెలుగు

మహావిష్ణువు నీలవర్ణం గలవాడిగా వర్ణింపబడ్డాడు. కనుక కృష్ణుడిగా పిలువబడ్డాడు. నలుపంటే కంటికి కనిపించని వెలుగు. ఆకాశం పగలు నీలంగా, రాత్రి నల్లగా ఉంటుంది. ఈ రంగులు కేవలం కంటికి కనిపించేవిమాత్రమే. ఆకాశానికున్న అసలు రహస్యం ఎవరికీ అందనిది. అంతుచిక్కనిది. వస్తువులుగా, వ్యక్తులుగా, గోళాలుగా వ్యక్తమయ్యే భౌతిక ప్రపంచమంతా అనేకమైన, చిత్రవిచిత్రమైన వర్ణాలతో, వైఖరులతో ఈ ఆకాశం నుండే పుట్టి వ్యక్తమౌతూంది. మళ్ళీ సమస్తం ఆ ఆకాశంలోకే లయమౌతూంది. మానవుడికి గల జ్ఞానమంతా ఇంతవరకే పరిమితమౌతున్నది. తన కందనట్టి ఈ విషయాలనే మనిషి "చీకటి" అని పిలిచాడు. కంటికి (బాహ్యఇంద్రియానికి) అందని ఈ వెలుగునే వేదాల్లోనిమహర్షులు చీకటివెనుక ఉన్న "అసలైన వెలుగు" అన్నారు. ఈ నిజమైన వెలుగునుండే మనకు తెలిసినభౌతికమైన వెలుగులన్నీ పడుతున్నాయి. సూర్యుడు, తారలు, చంద్రులు ఇట్లా వెలిగేవే! అవ్యక్తమైన ఆ మహాతేజస్సు నుండే అవన్నీ ఆ వెలుగు స్వీకరించి భౌతికమైన వెలుగును పంచుతున్నాయి.

భగవద్గీతలో కృష్ణుడు "తేజస్ తేజస్వినా మహమ్" అని చెప్పాడు కనుక వెలుగుకు కారణమైన ఆ మహాతేజస్సు నుండియే సూర్యునియందలి ప్రజ్ఞపుడుతున్నది. మనస్సు, ఇంద్రియాలు, దేహం మొదలగువాటియందు ఆయాభాగాలు ఉన్న ఈ మహావెలుగును మానవులు గ్రహించలేరు. అట్లాగే అన్నిట్లోనూ ఉన్న ఈ ప్రజ్ఞ ఆయావస్తువులజీవుల అంతర్వర్తియైన తాత్కాలిక ప్రజ్ఞగా మరుగుపడి ఉంది. వస్తువులు, చెట్లు, జీవులు, మొదలగు వాటిలోవాటి ప్రవర్తనలుగా, గుణాలుగా వ్యక్తమయే ఈ మహాతేజస్సునే ఆయా వస్తువులుగా, వ్యక్తులుగా గుర్తించడం జరుగుతున్నది. అన్నిట్లోగల అఖండతేజస్సును గుర్తించలేక చీకటిగా భ్రమపడటం జరుగుతున్నది.

ఒక నూలువస్త్రంతో చొక్కాలు, ధోవతులు, గౌన్లు, చీరలు, తయారు చేస్తారు. అవి వేరు వేరు వస్తువులుగా గమనింపబడుతున్నాయి. కానీ, వాటన్నిటిలో ఉన్న ఒకే పత్తి స్ఫురించదు కనుక గుర్తించలేని ఈ చీకటినే కృష్ణడంటారు. అన్ని వస్తువుల్లో, జీవుల్లో, లోకాల్లో అన్నికాలాల్లో దాగి ఉండే ఒకే ఒక వెలుగు కృష్ణుడు. ఆ చీకటి వెలుగు కన్పించేదిమాత్రం తెల్లనిపద్మ హృదయాలకే. పోతన భాగవతంలో ఈ విషయాన్నే గోపికలు తెలియజేస్తారు.

ఉ॥ నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపై
జల్లెడువాడు మౌళిపరిసర్పితపింఛమువాడు నవ్వురా
జిల్లెడు మోమువా డొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలార! మీపొదల మాటున లేడుగదమ్మ చెప్పరే!

ఈ నల్లనివాడు దాగి ఉండే తెల్లని మల్లెపొదల్లో ఈ నల్లనివానివెలుగే నెమిలిపింఛము. ఇది వెలుగు సంకేతం.

నలుపురంగుదేవుడు శరణాగతి కోరిన గోపికలకు (స్వతంత్రత లేని ప్రవృత్తి గలవారికి) వెలుగు దేవుడు. కనుక విష్ణువు నలుపురంగు కనిపించని వెలుగుకు ప్రతీకం.

నారాయణుని దేహకాంతులకు వర్షాకాలంలో పండిన నేరేడుపండ్లు ప్రతీకలు.

రాయల ఆముక్తమాల్యదలో వసంతఋతువు వర్ణనలో,

'...లబ్ధాగమన్మందాసార జంబువుల్ హిందోళ సాక్షాన్ముకుంద రోచులు....'

మేఘముల యొక్క రాకవల్ల (వర్షఋతువువల్ల) మందారమకరందవర్షము వల్ల వర్షాకాలం యొక్క నేరేడుపండ్లు (జంబువులు) హిందోళరాగం పాడినంతనే ప్రత్యక్షమైన నారాయణునియొక్క దేహకాంతులట!

మకరందవర్షధారాసంకేతం నల్లరంగు, శిశిరవసంతాల్లో, హిందోళరాగాన్ని (హరికి ప్రియమైన) కీర్తిస్తారట.

నేరేడుపండ్లు అమృతవర్షధారలకు పండేవి. విష్ణువు దేహకాంతులకు అవి ప్రతీకలు. హిందోళం విష్ణువును కీర్తించే రాగం. విష్ణువును, పరమాత్మను ఇంద్రియాలతో గాక మనసుతో కీర్తించాలి అని సూచిస్తుంది ఈ రాగం.



# భక్తి రస భావనా జగతికి నీరాజనం

- డా॥ ఇట్టేడు అర్కనందనాదేవి

శ్రీమహావిష్ణువు స్థితికర్తయై ప్రపంచాన్ని పాలిస్తున్నాడు. సంసారసాగరానికి ఆదిదేవుడూ అతడే. దానిని ఈదేర్చే తెరువూ అతడే. కనుక శ్రీమన్నారాయణుణ్ణి భక్తిసాధనతో సేవించి తరించే దివ్యమాసం ధనుర్మాసం. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించే పుణ్య మాసం, విష్ణుదేవుడే మాసరూపమైన వైభవం ధనుర్మాసం. తెలుగు నెలల్లో ఈ మాసం ఎక్కడా కనిపించకపోయినా మానవుల కర్మఫల సాధనకు ఉపయుక్తమై ఒప్పారే ప్రత్యేక దివ్యమాసం ధనుర్మాసమని శాస్త్రోక్తం. విష్ణుమూర్తి ఆరాధనకు అనువైన కాలంగా, మధుర మైనభక్తికి వేదికగా అలరారేదే ధనుర్మాసం. ఈ మాసంలో విష్ణు కైంకర్యం చేస్తే వేయి సంవత్సరాల పాటు చేసినశుభకర్మల పుణ్యఫలం లభిస్తుందనీ, అదే మధురానంద మనీ, అలౌకిక భావణాభరితమనీ బ్రహ్మాండ, భాగవత, స్కంద, ఆదిత్యపురాణాలు చెబుతున్నాయి. ఇటువంటి ధనుర్మాసానికి పరిపూర్ణత కలిగించిందే తిరుప్పావై.



ధనుర్మాస వ్రతంగా, శ్రీవ్రతంగా, మార్గశిరంతో ప్రారంభమవుతుంది. కనుక మార్గశీర్ష వ్రతంగా పిలువబడేదే తిరుప్పావై. 'తిరు' అంటే గొప్పదైందనీ, 'పావై' అంటే వ్రతమనీ అర్థం. అందుకేనేమో క్షీర సముద్రంలో శేషతల్పంలో యోగనిద్రానిమగ్నుడైన శ్రీమహా విష్ణువును ఉషఃకిరణాలు ప్రసరించని బ్రహ్మముహూర్తంలో మేల్కొ లిపి, ఆరాధించి తరించేఅదృష్టం ధనుర్మాసవ్రతం మానవాళికి కల్పిం చింది.

మనోరథం నెరవేరడానికి జగమంతా విష్ణుమయంగా భావించి ఆచరించేదే ధనుర్మాసవ్రతం. ఈ మాసమంతా సుప్ర భాతవేళ వినిపించే తిరుప్పావై ఆరాధన అమోఘం. గోదాదేవి పాడిన 30 పాశురాలు తిరుప్పావైగా పేరుగాంచాయి. ధనుర్మాసంలో అత్యంతముఖ్యమైన పాశురప్రభాతం అనుభవైక వేద్యం, అలౌకికం, అవ్యాజమానం.

ధనుర్మాసవ్రతం అంటే తొలిమంచు కరిగినవేళ సుప్ర భాతరాగాల నడుమ భగవంతునికి చేసే మేల్కొలుపు కైంకర్యం. భగవంతుని ఆశీస్సులే అనంతకోటికిరణాలై లోకాన్ని జాగృత పరుస్తాయి. సకలసృష్టినీ మేల్కొలిపే భగవంతుడు ఆర్తితో పిలిచే భక్తజనుల పలుకుకై ఎదురుచూస్తాడు. ఉలిక్కిపడి మేల్కొని తత్ క్షణం రక్షణనిస్తాడు. నీడలా తోడుంటాడు. ప్రపంచజగతిపై స్వాతంత్ర్యంగల అఖిలబ్రహ్మాండనాయకుడు భక్తిసామ్రాజ్యంలో తరించిన వారందరూ తనపై అధికారం గలవారని నిరూపించాడు. దేవుడొక్కడే జీవుని మధురభక్తికి చలించేదీ, కరుణించేది. భగవంతుణ్ణి నోరారా 'పలుకే బంగారమాయెనా' అని ప్రశ్నించే భావగంభీరత కేవలం భక్తహృదయానికే చెందిన స్వాధికారత. భక్తునికిమాత్రమే భగవంతునిపై సర్వాధికారం. అది స్వాభిమానానికే అలంకారం. నిశ్చల, నిర్మల, నిరామయస్వరూపమే అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని నిత్యనిజరూపంగా విరాజిల్లుతుంది. అత్యంత తేజస్సుతో సదా భాసిల్లే ఆ రూపం వెనుక గంభీరతత్త్వం దాగుందని తెలియ పరుస్తుంది- తిరుప్పావై!

భగవంతునికి భక్తులంటే వల్లమాలినప్రేమ, అభిమానం, ఆశ్రితవ్యామోహం గలవాడనే నిందను లోకంలో మోస్తూనే - అంత ర్యామిగా ఉన్న తనను తెలుసుకోవాలనీ, తద్వారా ఆనందాన్ని భక్తులు పొందాలనీ కోరుకునే విభుడు విష్ణుదేవుడంటుంది- తిరు ప్పావై. భగవంతునిపై గల అఖండ విశ్వాసమే భక్తి. అది ఆనందా నికీ, అలంకారానికీ నెలవు. అవి ఎక్కడుంటే అక్కడే కొలువుంటాడు- శ్రీహరి. ప్రాణికోటి వైభవంగా బ్రతకాలనే స్వామికోరికకు ప్రతి రూపంగా నిలుస్తుంది - ధనుర్మాసమంతా......







*(గతసంచిక తరువాయిభాగం...)*

సైనికభటులతో చోళరాజు మంత్రులు పెద్దరెడ్డి ఇచ్చిన ధనధాన్యాదులతో తమ నగరానికి వెళ్ళారు. జరిగిన వృత్తాంత మంతా చెప్పారు. రాజు ఆశ్చర్యపడ్డాడు.

'ఆహా! పరకాలుడు గొప్పవాడు. మాట నిలకడవాడు. అందుకే డబ్బు చెల్లించాడు' అని సంతోషించాడు.

పరకాలునికి ముందు ఏఏ గౌరవాలు న్నాయో రాజలాంఛనాలున్నాయో వాటిని చోళరాజు పునరుద్ధరించాడు. సంతోషించాడు. డబ్బంతా ముట్టిందని చెల్లుచీటి కూడా ఇచ్చాడు. అంతేకాదు అతనిని సీమాధిపతిని చేశాడు. సర్వం శుభంకాగా స్వామి సొమ్మంతా మాయం చేశాడు. చోళరాజేంద్రుడు సొమ్ము మాయం కావడం చూచి నివ్వెరపోయాడు.

పరకాలుడు మోసగాడు. మాయాధన మిచ్చాడు. మాయ చేశాడు. ఈ మాయల వానిని నమ్మకూడదు. ఇంద్రజాలం నేర్చిన ఆ పరకాలుని దారిలో పెట్టడం ఏలాగ అని ఆలోచించి సైనికులతో... 'వెళ్ళండి. అతని సీమను స్వాధీనం చేసుకోండి. ఆ పట్టణంనుండి వెడల గొట్టండి. ఎక్కడి కయినా పొమ్మనండి.' అని తరిమాడు. వారూ రాజాజ్ఞను పరకాలునితో మనవి చేశారు. పరకాలుడు కూడా.

'చాలు చాలు మీ సహవాసం. మీ పట్టణం మీరే ఏలుకోండి' అంటూ కుముదవల్లితో 'అనురాగవల్లి! విన్నావు కదా చోళరాజు దాష్టం. డబ్బు చెల్లించాక నా సీమ లాక్కోవడం సరికాదు. వేయి మంది వైష్ణవులకు సమారాధన చేసిగాని నేను ఆరగించను. వైష్ణవార్జన వ్రతం మానకూడదు. అంచేత మరల రాజును ప్రార్థించి సేవకుడనవుదా మన్నా రాజు సుతరామూ అంగీకరించడు. అయినా భూపాలుని డబ్బుతో హరిభక్తులను పోషించడం సబబు కాదు. రాజు విత్తం దోషభూయిష్ఠం. ఒకసారి కరువు కాటకాలతో ఎవరికీ ఏవీ దొరకలేదు.

సప్తఋషులు పీనుగును తినడానికి సిద్ధమయ్యారు. రాజు నిషేధించాడు. అపుడు ఇది రాజద్రవ్యం. తినరాదు అని వదలినారు. ఆ ధర్మం ధర్మమే అని శ్రీహరి చెప్పాడు. అయితే నిస్వార్థబుద్ధితో చేసిన అధర్మం, ధర్మం, పశుహింస పాపంకాదు. ఉద్దేశంబట్టి ధర్మనిర్ణయం చేయవలె. హింస అయినా సత్కర్మకోసమయితే దోషం లేదు. ఈ ఉపాయం తప్ప ప్రస్తుతం మరేదీ గోచరించడం లేదు. 'నేను చౌర్యవృత్తితో డబ్బు సంపాదించి నవనీత చోరకింకరులను ఆరాధిస్తాను' అన్నాడు. వెంటనే తనలాంటి వేయిమందిని పరకాలుడు జతచేసుకొన్నాడు. చోరవృత్తికి అవసరమయినవి అన్నీ సమకూర్చుకొన్నాడు. ఊర్ధ్వపుండ్రధారియై భార్యతో సహా నదులూ, అడవులు దాటాడు. సముద్రతీరం చేరుకొన్నాడు.

ఆ ప్రదేశం సామాన్యమయంది కాదు. ఓడలలో రకరకాల వస్తువులు నింపి దించుతూ వ్యాపారం సాగే పరిసరం. ఎందరో వర్తకులు గుర్రాలమీద ఏనుగుల మీద వచ్చి బేరాలు మాట్లాడుకొనే 'విఫణి'. వచ్చేవారు పోయేవారితో సమ్మర్దమయినచోటు. అటువంటి స్థలాన్ని పరకాలుడు ఎంపిక చేసుకున్నాడు. ఒక్కసారిగా వారి మీదబడి



ధనకనకవస్తువాహనాదులు తస్కరించడం మొదలెట్టాడు. చొక్కు పొడిచల్లి దోచుకోవడం ఒకరకం. ఏమరిన వేళ గుట్టుచప్పుడుగా అపహరించడం ఒక వైనం. కన్నం పెట్టి దోచుకోవడం ఇంకో పద్ధతి. పరకాలుడు ప్రదేశాలు మారుస్తూ పకడ్బందిగా చౌర్య వృత్తి కొనసాగిస్తూ వాగ్దానం ప్రకారం పరకాలుడు వేయిమంది వైష్ణవులకు సమారాధన చేస్తుండేవాడు.

పరకాలుడు శంఖచక్రధారులను, తిరుమణి ధారులు కనబడితే చాలు భక్తితో అర్చించేవాడు. ఒకసారి చౌర్యానికి పరకాలుడు ఒక పట్టణానికి వెళ్ళాడు. ఆ రోజు ఎడతెరపిలేని వర్షం. దొంగతనానికి తగిన వేళకోసం కాచుకున్నాడు.

ఒక ఇల్లాలు మగడు భోజనం చేశాక ఆ పళ్ళాన్ని కడగడానికి ఇంటి ముంగిటికి వచ్చింది. వానలో తడవడమెందు కని పళ్ళెం కడిగి ఒక్కసారిగా నీళ్ళు పారవేసింది. అపుడే మెఱుపు మెరిసింది. ఆ మెరుపులో కళ్యాణి చేతిలోని పాత్రను చూచాడు. అది మామూలు పాత్రకాదు. రజత పాత్ర. వెంటనే పరకాలుడు ఆ పాత్రను లాగేసుకొన్నాడు.

ఆపై 'అస్మద్గురు భ్యోన్నమః' అంది ఆ ఇల్లాలు.

ఈ వాక్యం వినేసరికి పరకాలుడు అదరిపడ్డాడు. ఈ మాట అనగలిగేవారు వైష్ణవులు. వైష్ణవుల సొమ్ము అప హరించడమా అంటూ జడుసుకున్నాడు. ఆ పాత్ర అక్కడే వదిలేశాడు. ఏమవుతుందో చూద్దామని ఆగాడు. ఆ ఇల్లాలు ఇంట్లోకి అడుగులు పెట్టింది. తన మగనితో జరిగింది విన్నవించింది. భర్త కోప్పడలేదు సరికదా దగ్గరికి పిలిచి–

'కళ్యాణీ! ఈ పాత్రను అపహరించినవాడెవడని అను కొన్నావ్' సాక్షాత్ పరకాలుడే. అతడు భాగవత కైంకర్య తత్పరుడు. శ్రీవైష్ణవసేవానిరతుడు. అతని కైంకర్యానికి ఆటంకం కలిగించవద్దు. నీవెంతటి భాగ్యశాలివి' అని పొగడుతుంటే ఆమె వాకిలికి వచ్చింది. వాకిట్లో 'పాత్రను' చూచి గతుక్కుమన్నది. వెంటనే లోపలికి వెళ్ళి తన భర్తతో ఆ సంగతి చెప్పింది. అంతేకాదు...

'స్వామీ! వచ్చినవాడు దొంగ అనుకొన్నాను. అంచేత ఆచార్యుల సంస్మరణ చేశాను. నేను అపకారం గాని, అప చారంగాని చేయాలనుకోలేదు. పెద్ద తప్పిదమే జరిగింది' అని బాధపడింది.

నిజమే! అయినా భాగవతకైంకర్య నిరోధం జరిగి పోయింది. బ్రహ్మాదుల శాపానికి నిష్కృతి ఉంది. బ్రహ్మహత్యా దులకు నివారణోపాయముంది.

కాని, వైష్ణవాపరాధాలకు నిష్కృతి లేనే లేదు అని కోపపడ్డాడు. ఈ సంభాషణలంతా వింటున్న పరకాలుడు వారికి ఎదురుగా వచ్చి నిలబడ్డాడు.

దంపతులు పరకాలుని పాదాలపడ్డారు. అపచారం, అపచారం. క్షమార్హులమన్నారు.

'నా పనికోసం వచ్చింది తల్లి. ఆమె శిక్షార్హురాలు కానే కాదు' అని విన్నవించాడు పరకాలుడు. అక్కడ పాత్ర కన బడడంతో ఆశ్చర్యపడ్డాడు. తదనంతరం యథాప్రకారం వైష్ణవ పూజలకు ఆటంకాలు లేకుండా పరకాలుడు శ్రద్ధవహించి చేయ సాగాడని ఈ కథనంతో 'తిరువెంగళనాథులవారు షష్ఠాశ్వాసం' ముగించారు.

.........

హైమసరోజాంగ! అలమేలు మంగ!
జీమూత సంకాశ! శ్రీ వేంకటేశ!
వనమాలి! అవధారు! వరదానశీలి!

లోకంలో భక్తులకే కొదువలేదు. భక్తులు తమ కోరికల నిమిత్తం సేవిస్తుంటారు. ఫలసిద్ధికలిగితే మొక్కుబడులు సమర్పించుకొంటారు. కాని ఫలాపేక్షలేకుండా కేవలం ఒక ప్రతిన నిలుపుకోవడానికోసం అష్టకష్టాలు పడిన పరమభక్తుడు పరకాలుడు. అయినా అతని అకుంఠితదీక్ష అతనికి శ్రీరామరక్ష కావడమే చిత్రం. అతడు నిత్యమూ చేసే భాగవతార్చనకు రంగశాయి చాల సంతోషించాడు.

ఒకసారి గరుడవాహనమెక్కి లక్ష్మీకళత్రుడై పరకాలుని దగ్గరికి వచ్చాడు. లోగడ ఎవరూ చేయని వ్రతాన్ని నియమం ప్రకారం చేస్తున్న పరకాలుని చూడడానికోసం పరాంకుశాది యోగులు, హరిహరులు శ్రీపతితో కదిలారు. సముద్రతీరంలో గరుడుని నిలిపాడు రంగనాథుడు. **(ఇంకా ఉంది)**





# ఉత్తమం ఉత్తరద్వార దర్శనం

- శ్రీమతి డి.వరలక్ష్మి

మన ఆరునెలలు దేవతలకు పగలు, మరో ఆరునెలలు రాత్రి. దీనిప్రకారం దేవతలందరూ వైకుంఠఏకాదశినాడు దక్షిణాయనం నుంచి ఉత్తరాయణపుణ్యకాలానికి అంటే చీకటి రాత్రినుంచి వెలుగులు చిమ్మే పగటిలోకి వచ్చారన్నమాట. స్వర్గద్వారాలను తెరవగానే ముందుగా ఈ కాంతి ఉత్తరద్వారం నుంచి ప్రవేశిస్తుంది. అందుకే విష్ణ్వాలయాలలో ఇవాళ ఉత్తరం వైపున ఉన్న ద్వారాన్ని తెరిచి ఉంచుతారు. ఈ ద్వారంనుంచి భక్తులు స్వామివారిని దర్శించుకోవడం అత్యంత పుణ్యప్రదం.

**అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్,**
**లోకాధ్యక్షం స్తువ న్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్**

ఆదిమధ్యాంతరహితుడు, నిర్వికారుడు, బ్రహ్మాది దేవతలకు ప్రభువు, సర్వలోకాలకు నియామకుడు, సర్వవ్యాపకుడు అయిన మహావిష్ణువును నిరంతరం స్తుతించడంవల్ల సకలదుఃఖాలు తొలగి, సంపదలు కలుగుతాయి.

ఏకాదశి అంటే తిథులలో పదకొండవది. ఇది సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుతో ముడిపడినతిథి. అందుకే ఏకాదశిని హరితిథి అనీ, వైకుంఠదినమనీ అంటారు. ఇటువంటి ఏకాదశులు మాసానికి రెండు చొప్పున సంవత్సరానికి ఇరవైనాలుగు వస్తాయి. అధిక మాసం వచ్చిన సంవత్సరంలో ఇరవై ఆరు వస్తాయి. (చాంద్రమానం ప్రకారం ప్రతిమూడు సంవత్సరాలకూ ఒక అధికమాసం వస్తుంది). వీటిలో ఆషాఢ శుద్ధ ఏకాదశిని తొలిఏకాదశిగానూ, ధనుర్మాసంలో వచ్చే శుద్ధఏకాదశిని వైకుంఠఏకాదశిగానూ మనం పండుగలాగ జరుపుకుంటాం. ఉత్తరాయణ ప్రారంభదినం కావడం మూలాన ఇది అత్యంతవిశిష్టమైంది. ముక్కోటి అంటే ముప్పది మూడుకోట్ల దేవతల్ని ఉద్దేశించింది. అప్పటినుంచి మూసి ఉన్న స్వర్గద్వారాలు ఈ ధనుర్మాసారంభంనుంచి తెరుచుకుంటాయని పురాణ వచనం.



ఈ ఏకాదశినాడు విష్ణుమూర్తి గరుడవాహనారూఢుడై ఉత్తరద్వారాన దర్శనమిస్తాడట! ఆ దివ్య సుందరరూపుణ్ణి దర్శించుకోవడం కోసం దేవతలందరూ ఈ రోజున దివినుంచి భువికి దిగివస్తారట!అందుకే దీనికి ముక్కోటి ఏకాదశి అని పేరు. ఇదే వైకుంఠ ద్వారం. ఈ వైకుంఠద్వారమే

డిసెంబరు, 29
వైకుంఠ ఏకాదశి
సందర్భంగా...



ధనుర్మాసంలో శుక్లపక్షంలో వచ్చే 'ఏకాదశి'ని 'వైకుంఠ ఏకాదశి' అంటారు. తిరుమలక్షేత్రంలో వైకుంఠ ఏకాదశి, ఆ మరునాడు వైకుంఠద్వాదశి ఇలా ఇది రెండు రోజుల పండుగగా ఎన్నో విశిష్టసేవలతో నిర్వహింపబడు తుంది.

**వైకుంఠద్వారం తెరవబడుతుంది**

వైకుంఠ ఏకాదశికి ముందురోజు అనగా దశమి నాటి రాత్రి ఏకాంతసేవానంతరం బంగారు వాకిళ్లు మూసి వేస్తారు. పిదప తెల్లవారుజామున వైకుంఠఏకాదశినాడు సుప్రభాతసమయంనుండి మరునాడు ద్వాదశినాటి రాత్రి ఏకాంతసేవ వరకు శ్రీవారి గర్భాలయానికి దగ్గరగా ఆను కొని ఉన్న "ముక్కోటిప్రదక్షిణమార్గం" తెరవబడుతుంది.

ఈద్వారాలను వైకుంఠద్వారాలనీ, ఉత్తరద్వారాలనీ అంటారు. ఈ మార్గాన్ని 'వైకుంఠప్రదక్షిణమార్గం' అనీ అంటారు. ఈ మార్గం విద్యుద్దీపాలతో, సుగంధ, సుమనో హరమైన పూలమాలలతో అలంకరింపబడిన ఈ వైకుంఠ ప్రదక్షిణంలో ప్రవేశించే భాగ్యం ఏడాదిలో ఈ రెండురోజులు మాత్రమే కలుగుతుంది. వైకుంఠఏకాదశి, ద్వాదశిరోజుల్లో శ్రీ స్వామివారిని దర్శించిన తర్వాత వైకుంఠప్రదక్షిణంలో ప్రవేశం కలుగుతుంది. ప్రవేశించిన భక్తులకు దివ్యానుభూతు లతో పాటు, పూర్వసంచిత పాపకర్మలన్నీ నశిస్తాయి. ఇష్టార్థా లన్నీ నెరవేరతాయి.

వైకుంఠ ఏకాదశినాడు సప్తగిరీశునికి మరో విశేష ఉత్సవం జరుగుతుంది. అదే స్వర్ణరథోత్సవం!

వైకుంఠ ఏకాదశినాడు ఉదయం 7 గంటలవేళ కలియుగవైకుంఠనాథుడైన కొండలరాయడు శ్రీదేవీ భూదేవేరు లతో కలిసి బంగారుతేరుపై పురవీథుల్లో దర్శనమిస్తారు. వైకుంఠఏకాదశినాటి స్వర్ణరథోత్సవంలో పయనిస్తున్న అఖి లాండకోటి బ్రహ్మాండనాయకుణ్ణి దర్శిస్తే చాలు భక్తుల మనోరథాలు తప్పక తీరతాయి. భక్తుల గోవిందఘోషలమధ్య జరిగే తిరుమల గోవిందుని స్వర్ణరథోత్సవదృశ్యాన్ని వర్ణిం చడం అక్షరాలకు అందదు. దర్శించి అనుభవించాలి. అంతే!

సూర్యుని ఉత్తరాయణప్రవేశానికి సూచన. అందుకే ఉత్తరద్వారం నుంచి విష్ణుదేవుణ్ణి దర్శించుకున్నవారికి మోక్షం లభిస్తుందని పురాణ వచనం. శ్రీరంగం, తిరుపతి, అన్నవరం, భద్రాద్రి, మంగళగిరి, యాదగిరిగుట్టవంటి అన్నిక్షేత్రాలలో ఈ ముక్కోటి ఏకాదశిని మహోత్సవంగా జరుపుకుంటారు.

ముక్కోటి ఏకాదశిని అత్యంతమహిమాన్వితమైన రోజుగా పురాణాలు వర్ణిస్తున్నాయి. అందుకే ఈనాడు ఉప వాసం, విష్ణుపూజ విశేషఫలాలు ఇస్తాయి. వైకుంఠఏకాదశినాడు గోపూజ చేయడం చాలమంచిది. విష్ణుమూర్తిసన్నిధిలో ఆవు నేతితో దీపం వెలిగిస్తే సర్వపాపాలు హరించి అజ్ఞానమనే చీకట్లు తొలగి ముక్తి లభిస్తుందని పురాణాలు చెబుతున్నాయి. ఉత్తరాయణానికి ఎంతటి ప్రాధాన్యత ఉందో చెప్పాలంటే ఒక్క ఉదాహరణం చాలు. శంతనుడు తనకుమారుడైన భీష్మునికి 'స్వచ్ఛందమరణం' అనే వరం ఇచ్చాడు. దక్షిణాయనంలో కురుక్షేత్రయుద్ధంలో అర్జునబాణహతుడైనా- అంపశయ్యపై పరుండి ఉత్తరాయణం వచ్చిన తరువాతనే ప్రాణాలు విడిచి, వైకుంఠంలో స్థానం పొందాడు. అంపశయ్యపై ఉన్న సమయం లోనే భీష్ముడు ధర్మరాజాదులకు విష్ణుసహస్రనామాలను బోధిం చాడు. ముక్కోటి ఏకాదశి ప్రాశస్త్యం, ఆ రోజు ఆచరించవలసిన విధివిధానాలగురించి కాశీనాథోపాధ్యాయ విరచిత ధర్మసింధు ఇలా చెబుతోంది-

సౌరశక్తి ఉత్తరాయణానికి మారే ముందు వచ్చే ఏకాదశి ఇది. ఏకాదశి ముందురోజు ఒంటిపూట భోజనం చేసి, ఏకాదశినాడు (ఓపిక ఉన్నంత వరకు) ఉపవాసం చేయాలి. ఆ రోజు షోడశోపచారాలతో శ్రీమన్నారాయణుణ్ణి పూజించాలి. ద్వాదశినాడు పునఃపూజ చేసి, మహానైవేద్యం (పండ్లు, పిండి వంటలైనా పనికి వస్తాయి) సమర్పించాలి. అతిథిని పిలిచి భోజన తాంబూలాదులతో సంతుష్టి పరచి పారణ చేయాలి. అనంతరం "ఏకాదశ్యాం నిరాహారో భూత్వాహ మపరేహని భోక్ష్యామి పుండరీకాక్ష శరణం మే భవాచ్యుత" అనే మంత్రం చెప్పుకుంటూ విష్ణుమూర్తికి పుష్పాంజలి సమర్పించాలి.







కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్ ।
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥

# ఆముక్తమాల్యద-విశేషాలు

- శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

పెరియాళ్వారుల దివ్యవంశం అనే నందనవనంలో కల్పలత వంటిదీ, శ్రీరంగనాయకస్వామివారితో హరిచందనంలా జంటగా కనపడేదీ, గొప్పతనం మూర్తీభవించి అవతరించిందీ, కరుణప్రకర్షమున మరొక కమలా (శ్రీ)దేవిలాంటిదీ అయిన గోదాదేవికి వందనాలు.

నీలాదేవి ఉన్నతస్తనాలనే కొండచరియలలో హాయిగా నిద్రించే శ్రీకృష్ణుణ్ణి మేలుకొలిపినతత్త్వాన్ని తిరుప్పావైలో బోధించింది– గోదాదేవి. తాను ముడిచివదలిన పూలమాలలు సమర్పించి, పెరుమాళ్లను తనవశం చేసుకుని ఆనందానుభూతిని పొందింది గోదాదేవి. అలాంటి **ఆముక్తమాల్యద**కు అభివందనాలు.

ఆండాళమ్మవారిని అష్టోత్తరశతనామాలతో అర్చిస్తాం. అయితే కోద్రై, గోదా, శూడికొడుత్త నాచ్చియార్, ఆముక్తమాల్యద, ఆండాళ్ అనేపేర్లు బాగా ప్రాచుర్యం పొందాయి. తమిళంలో **కోద్రై** అంటే పూలదండ అని అర్థం. ఆ శబ్దాన్నే **గోదా** అని సంస్కృతీకరించారు. భూమిని **గో** అంటారు. ఆండాళమ్మ భూదేవిఅంశ. కాబట్టి ఆమెకు గోదా అనేపేరు కలిగిందని కూడా వ్యవహారంలో ఉంది. పెరియాళ్వారులు తయారుచేసిన పూలమాలలను ఆండాళమ్మ ముందుగా తాను ధరించి, ఆ తర్వాత ఆ పూలదండలను (పెరియాళ్వారుల ద్వారా) స్వామికి సమర్పిస్తుంది. ఈ గాథను దృష్టిలో ఉంచుకుని ఆమెకు **శూడి కొడుత్త నాచ్చియార్** అనే వ్యవహారం కలిగింది. తమిళంలోని శూడికొడుత్తనాచ్చియార్ అనే పేరుకు సంస్కృతీకరణరూపం **ఆముక్తమాల్యద.** గోదాదేవిని 'ఆముక్తమాల్యద' అని మొట్ట మొదట పేర్కొన్నవారు అనంతాచార్యులవారు. వీరు రామానుజులవారికి శిష్యులు. అనంతాచార్యులవారు రచించిన ఆళ్వారాచార్యుల గాథలను తెలిపే **ప్రపన్నామృతం** అనే గ్రంథంలో 'ఆముక్తమాల్యద' అనే పేరు ఉంది. ఆ పేరున్న శ్లోకం –



**ఆముక్తమాలికా యేన విష్ణవే గోదయార్పితా,**
**ఆముక్తమాల్యదా నామ తస్యా స్తే నాభవ ద్భువిః.**

**- ప్రపన్నామృతం-ప్రథమభాగం-19 అధ్యా-37 శ్లోకం.**

పై శ్లోకంలోని ఆముక్తమాల్యద అనే పేరును శ్రీకృష్ణదేవరాయలవారు యథాతథంగా స్వీకరించి, తన కావ్యానికి నామకరణం చేశాడు.

రాయలవారు రచించిన ఆముక్తమాల్యద తెలుగు పంచమహాకావ్యాలలో ఒకటి. కథానాయికపేరు కావ్యానికి పెట్టిన తొలి తెలుగుకావ్యం రాయలవారి ఆముక్తమాల్యద. ఆళ్వారుల (పెరియాళ్వారులు, ఆండాళ్) గాథలను అందించిన తొలితెలుగు ప్రబంధం ఆముక్తమాల్యద. విశిష్టాద్వైతసిద్ధాంతాను గుణమైన తొలితెలుగుకావ్యం ఆముక్తమాల్యద. కావ్యాశ్వాసాంతాన గద్యానికి బదులు పద్యంలో కవి తనవివరాలు తెలిపిన తొలితెలుగుకావ్యం ఆముక్త




మాల్యద. ఏడుకొండలవాడయిన **వేంకటభర్తకు** అంకితమీయబడిన తొలితెలుగుకావ్యం ఆముక్తమాల్యద.

ఆముక్తమాల్యదను రచించిన కృష్ణదేవరాయలవారు తన జీవితకాలంలో ఏడుకొండలలో వెలసినస్వామివారిని ఏడు పర్యాయాలు దర్శించుకున్నారు. (శాసనాధారాల ప్రకారం) ఏడవ పర్యాయం (క్రీ.శ. 1524) నాటికి ఆముక్తమాల్యదను పూర్తిచేసి, ఏడుకొండలస్వామివారైనవేంకటభర్తకు అంకితం ఇచ్చాడు. 'ఏడుకొండలవాడు', 'ఏడుపర్యాయాలదర్శనం' – వీటన్నింటినీ పరిశీలించే కాబోలు ఆరుఆశ్వాసాలుగా రచితమైన ఆముక్తమాల్యదను కొందరు ఏడుఆశ్వాసాలుగ చేశారని ఒక భావన.

పూలమాలను పెరుమాళ్లకు సమర్పించిన వృత్తం (చరిత్ర) కలిగిన కావ్యం కాబట్టి రాయలవారిఆముక్తమాల్యద ప్రారంభంలో రాయలవారు **శ్రీకమలావధూటి** అనే ఉత్పల **మాలావృత్తాన్ని** రచించారు–సందర్భోచితంగా, ప్రతీకాత్మకంగా.

ఆముక్తమాల్యదలో వైష్ణవకవిత్రయగాథ రచితం, ఆ కవిత్రయం పెరియాళ్వారు, గోదాదేవి, యామునాచార్యులు. పెరియాళ్వారులు – తిరుపల్లాండు, పెరియతిరుమొళి మొదలైనవీ; గోదాదేవి– నాచ్చియార్ తిరుమొళి (143 పాశురాలు), తిరుప్పావై (30 పాశురాలు); యామునాచార్యులు– స్తోత్రరత్నం, సిద్ధిత్రయి, ఆగమప్రామాణ్యం, గీతాభాష్యం రచించారు.

**మాసానాం మార్గశీర్షోஉస్మి** అని గీతాచార్యులు శ్రీకృష్ణులవారిమాట. మార్గశీర్షం / ధనుర్మాసం 30 రోజులు గోపికలు కాత్యాయనీవ్రతం చేసి, తమకోరికమేరకు శ్రీకృష్ణుణ్ణి పొందారు. గోదాదేవి తిరుప్పావైలోని ముప్పైపాశురాలనూ ధనుర్మాసంలో పారాయణం చేయడం వైష్ణవసంప్రదాయం. తిరుమలలోకూడ ధనుర్మాసంలో ఆండాళ్‌తల్లి రచించిన తిరుప్పావైని పారాయణం చేస్తారు.

భగవద్రామానుజులవారు శ్రీవిశిష్టాద్వైతాన్ని ప్రచారం చేసి, ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించారు. రామానుజులవారు తిరుప్పావై పాడేవారు. తిరుప్పావై రచించిన ఆండాళమ్మవారు మొక్కుకున్న మొక్కును ఆమె తీర్చలేకపోతుంది. ఆమె మొక్కును యతిరాజులవారు తీరుస్తారు. రామానుజులవారికి **తిరుప్పావైజీయర్** అనే పేరు కలిగింది. గోదమ్మతిరుప్పావై మీద **యతిరాజముద్ర** ఉండడంకూడ తిరుప్పావై ప్రాచుర్యానికి గల కారణాలలో ఒకటి అని భావించడం సత్యదూరం కాదు.

గోదాదేవిరచనలను ఉపనిషదాదిసర్వగ్రంథాలసారంగా అన్వయం చేస్తూ ఎన్నో వ్యాఖ్యానాలు వెలువడ్డాయి.

రాయలవారిఆముక్తమాల్యదకథకు మూలగ్రంథాలు గరుడవాహనపండితబిరుదాంకితుడగు శ్రీనివాసదీక్షితులు రచించిన దివ్యసూరిచరితం, అనంతాచార్యులవారు రచించిన ప్రపన్నామృతంకాగా విష్ణుపురాణం, నాలాయిరదివ్యప్రబంధం – ముఖ్యంగా నాచ్చియార్‌తిరుమొళి, విష్ణుచిత్తులవారిపెరియ తిరుమొళి గ్రంథాలలోని కొన్నిపాశురాలలోని భావాలు రాయలవారు గ్రహించి, వినూత్నపథంలో పద్యాలు రచించి, ఆముక్తమాల్యదకు నిండుదనం కలిగించారు.

రాయలవారి ఆముక్తమాల్యదవంటి ప్రౌఢప్రబంధం ఇదివరలో లేదు, ఇప్పుడూ లేదు, ప్రస్తుత పరిస్థితులను గమనిస్తే ఇకమీదటకూడా రాదు. అదీ ఆముక్తమాల్యద ప్రత్యేకత!

**స్వోచ్ఛిష్టమాలికాబంధ గంధబంధుర జిష్ణవే**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్.**









# గోదా పాశురాల్లో గోవిందుడు

- శ్రీమతి వి. ఉమారాణి

ఆండాళ్ పెరియాళ్వార్ పెంపుడుకూతురు. ఈమె పదారుపాశురాల్లో వేంకటేశ్వరుణ్ణి నుతించింది. మేఘాలతో స్వామికి సందేశం పంపింది. మధురభక్తి విరహాన్ని ప్రకటించింది. శ్రీపెరియాళ్వార్లకుమార్తె అయిన శ్రీశూడిక్కొడుత్త నాచ్చియార్ (గోదాదేవి) భగవానుని విషయంలో తనకు గల వ్యామోహం అతివేలం కాగా, అతనిని పొందడంకోసం అనేక విధాలుగా ఉపాయానుష్ఠానాన్ని చేసింది. అయినా అవి ఏవీ ఫలించకపోవడంవల్ల చాలా ఆర్తిని పొందింది. మార్గశీర్ష మాసం అంతా తిరుప్పావై- అనే నోమును నోచి, స్వామి అనుభవంకోసం ఎదురుచూచినా అతడు వచ్చి సేవను అనుగ్రహించకపోవడం వల్ల శరీరాన్ని ధరించలేకపోయింది. వియోగంలో ఉన్నవారిని కలిపే స్వభావాన్ని కల మన్మథుని ఆశ్రయించి, అతని అనుగ్రహంతో భగవానుణ్ణి పొందాలని ప్రయత్నించింది. ఈ పాశురంలో "ఓ కామదేవా! నిన్ను, నీ తమ్ముణ్ణి నమస్కరిస్తున్నాను. నీవు కృపజేసి, ఏదో రీతిలో శ్రీవేంకటేశ్వరునికే నేను కైంకర్యం చేసేటట్లుగా కల్పించాలి- అని మన్మథుణ్ణి ప్రార్థిస్తున్నది.



తైయొరు తిఙ్గళుమ్ తరై విళక్కి
తణ్ మణ్డల మిట్టు మాశి మున్నాళ్,
ఐయనుణ్ మణఱ్కొణ్డు తెరువణిన్దు
అళగిను క్కలఙ్గరిత్తు అనఙ్గదేవా!,
ఉయ్యవుమాఙ్గొలో ఎన్ఱు శొల్లి
ఉన్నైయుమ్ ఉమ్బియైయుమ్ తొళుదేన్,
వెయ్యదోర్ తళలుమిళ్ శక్కరక్కై
వేఙ్గడవఱ్కు ఎన్నై విదిక్కిఱ్రియే (1-1)

ఓ అనంగదేవా! మార్గశీర్షమాసం అంతా నోము నోచాము. ఇక ఈ తైమాసం అంతా భగవానుడు వచ్చే చోటును శోధించి, అందంగా, గుండ్రంగా ఉండే ముగ్గును పెట్టి, మాఘ మాసం మొదటిపక్షంలో సుందరమైంది, అతని సౌకుమార్యానికి తగింది, సన్నని ఇసుకను తీసుకొని అతడు వచ్చేదారిని అందమైన అతని కోసమే అలంకరించి, **"ఉజ్జీవించగలమా!"** అనే ఆశతో నిన్ను, నీ తమ్ముడైన (జాంబవతీ పుత్రుడైన) సాంబుణ్ణి కొలిచాను. అందువల్ల కృపామూర్తివైన ఓమన్మథా! ప్రతి కూలుర పట్ల నిప్పు కణాలు ఉమిసే అద్వితీయం అయిన శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో ధరించిన శ్రీవేంకటేశ్వరునికి సర్వవిధ కైంకర్యాలను చేసేరీతిలో నన్ను నీవు కరుణించాలి.

ఈ పాశురభావాన్ని అనుసరిస్తూ **"నాడి నీ వేఙ్గడవఱ్కు విది ఎన్న ఇమ్మాఱ్టమ్"** అని తిరుప్పావై తనియన్‌లో రచింపబడింది.

ఘటకుడైన మన్మథుడు ఇష్టపడేవాటినే అతనికి సమర్పించాలని తలచి, రజోగుణప్రచురుడైన కామదేవుకు అనురూపం

అయేటట్లు మదం కల్గించే ఉమ్మెత్తపూలు, మోదుగపూలు మొదలైన వాటిని సేకరించి, తులసిని కోసి, స్వామికి సమర్పించే కులంలో పుట్టిన గోదాదేవి మన్మథునికి సమర్పిస్తూ, తనను శ్రీవేంకటేశ్వరునికి దాసురాలినిగా చేయాలని వేడుతున్నది.

**మత్త నన్నఱుమలర్ మురుక్కమలర్**
**కొణ్డుముప్పోదుమ్ ఉన్నడి వణజ్గి,**
**తత్తువమిలి యెన్ఱు నెఞ్జెరిన్దు**
**వాశగత్తళిత్తు ఉన్నై వైదిడామే,**
**కొత్తలర్ పూజ్గణై తొడుత్తుక్కొణ్డు**
**కోవిన్ద నెన్బదోర్ పెయరెళుది,**
**విత్తగన్ వేజ్గడవాణ నెన్నుమ్**
**విళక్కినిల్ పుగ ఎన్నై విదిక్కిటియే** **(1-3)**

ఓ కామదేవా! మంచిసువాసనను గల ఉమ్మెత్తపూలను, మోదుగపూలను తీసుకొనివచ్చి, మూడుప్రొద్దులలో నీ పాదాలకు నమస్కరించి, నిన్ను ఆరాధిస్తున్నాను. నేను నిన్ను సేవించినందుకు ఫలంగా నా మనోరథాన్ని నీవు నెఱవేర్చకపోతే నా మనస్సు చాలా నొచ్చుకొంటుంది. 'మన్మథుడు నిజంగా ఫలాన్ని అనుగ్రహించేవాడు కాడు. ఇతడు అసత్యమైన దైవం" అని లోకంలో అంతటా నిందిచేటట్లు, నేను నీ మహిమను నిందించేటట్లు ఏర్పడుతుంది. అటువంటి పరాభవాన్ని నీవు పొందకుండా, మంచిపేరు పొందాలని చూడు. మన్మథా! నీవు నాకు చేయవలసిన కార్యాన్ని చెబుతున్నాను - విను. గుత్తులు గుత్తులుగా వికసించేపూలు అనే బాణాలను వింటిలో సంధించి, మా రక్షణ కోసం పట్టాభిషిక్తుడైనవాని 'గోవింద' నామాన్ని నా హృదయంలో లిఖించి, అద్భుతమైన, వేంకటేశ్వరుడనే దివ్య జ్యోతిని నేను చేరేటట్లు నన్ను అనుగ్రహించాలి.

ఈ పాశురానికి పరమకారుణికులైన పెరియవాచ్చాన్ పిళ్ళై అందంగా రెండువిధాలైన అన్వయాలను చూపిస్తూ ఈ విధంగా అన్నారు- **"మదువిరియా నిన్ఱుళ్ళ పుష్పబాణజ్గళై తొడుత్తుక్కొణ్డు "గోవింద" ఎన్నుమ్ తిరునామత్తై అమ్బిలే ఎళుదిక్కొణ్డు ఎన్నుదల్, హృదయత్తిలే ఎళుదిక్కొణ్డు ఎన్నుదల్".**

ఇందులో మొదటి అన్వయానికి- గోవిందనామాన్ని బాణంలో రాసి, ఆ బాణాన్ని అతనిపై ప్రయోగించి, ఆ నామమే గోదాదేవి మనస్సులో ఎప్పుడూ అనుసంధింపబడుతున్నది - అని అతనికి తెలియజెప్పి, అతనికి నాపై దయ కలిగేటట్లు చేసి, నాతో అతడు సంశ్లేషించేటట్లు చేయాలి"- అని అర్థం.



లేక, "నీ బాణంలో అతని గోవిందనామాన్ని రాసి, దాన్ని నాపై ప్రయోగించి, అతని విషయంలోనే నా మనస్సు లగ్నం అయేటట్లుగా చేసి, అతనితో ఏకతత్త్వం అనేరీతిలో నన్ను కలుపు. శ్రీరాముని తిరునామంతో అంకితం అయిన అంగులీయకాన్ని హనుమంతుడు సీతాదేవికి ఇచ్చినట్లు, ఆచార్యుడు శిష్యునికి చక్రాంకనాన్ని చేసి, దాస్యనామాన్ని ఇచ్చేటట్లు, నీవు అతని తిరునామంతో అంకితం అయిన నీ బాణాన్ని నాపై ప్రయోగించి, నన్ను అతనికే అంకితం చేయాలి (అనన్యార్హగా చేయాలి). సీతాదేవి రామ నామాంకితం అయిన అంగులీయకాన్ని చూచి, ఆనందించినట్లు, అతడు





విశ్లేషా సహిష్ణుత కల్గి ఉన్నట్లే నేనుకూడా కొంత తృప్తిని పొందుతాను– అని దీని తాత్పర్యం.

రెండవ అన్వయానికి– "నీ మనస్సులో అతని నామాన్ని రాసి, అతనితో నన్ను కలపడానికి సంకల్పించి, అతనితో నన్ను చేర్చు. నీ మనస్సులో అతని నామాన్ని రాసికొన్నట్లైతే, ఆ తిరు నామ ప్రభావంచేత నీకు కూడా నావిషయంలో దయ కల్గు తుంది. అపుడు నా బాధ కొంత నీకు తెలుస్తుంది. నా విష యంలో అనుతాపం కల్గుతుంది. అపుడు నీవు నన్ను అతనితో తప్పక చేరుస్తావు. అందులో సందేహం లేదు – అనే భావం చెప్పవచ్చు. లేక, నీ మనస్సులో అతని నామాన్ని రాసి, అతనికి నన్ను శేషంగా చేసి, నిరుపాధికప్రాప్త శేషి అయిన అతనితో నన్ను చేర్చు"– అని కూడా భావం. ఈ విధంగా ఈ పాశురం లోని రసాన్ని అనుభవించినపుడు దానికి అంతం లేదు.

నాకు ఇష్టం ఉన్నదో? లేదో? అని సందేహించి, భగ వానుడు తిరుమలకు వచ్చి, నిలచి ఆలస్యం చేస్తున్నాడు కాబోలు! అందుకే నేను ఈవిధంగా శ్రమ అనుభవిస్తున్నాను. నా ఆర్తిని తెలిసి, వేగంగా వచ్చి నన్ను తనతో హత్తుకునేటట్లుగా కూడిక దైవం అనుకూలించాలి– అని ఇందులో గోదాదేవి ఆశపడు తోంది.

కాట్టిల్ వేఙ్గడమ్ కణ్ణపురనగర్,
వాట్ట మిన్ఱి మగిళ్న్దుఱై వామనన్,
ఓట్టరావన్దు ఎన్కై ప్పత్రి, తన్నొడుమ్
కూట్టుమాగిల్ నీ కూడిదు కూడలే (4–2)

ఓ సంధానదైవమా! (ప్రేయసీప్రియులను కలిపే ఓ దైవమా!) శ్రీదండకారణ్యంలో ఋషులతో కలసి ఉండి, వన వాసం చేసినట్లు, లేక శ్రీబృందావనంలో గోపికలతో కూడి ఉన్నట్లు, తిరుమలలో వేంచేసి ఉన్నవాడు, అయోధ్యలో అందరితో కలసి ఉండి నగరనివాసానుభవం అనుభవించి నట్లు, లేక, వ్రేపల్లెలో గోపికలతో కూడి ఉన్నట్లు, తిరుక్కణ్ణ పురంలో వేంచేసి ఉన్నవాడు, నగరవాసంతో, వనవాసంతో భేదం లేకుండా "వనవాసో మహోదయః" అన్నట్లు రెండిటినీ మధురంగా ఆస్వాదించే మనస్తత్త్వం కలవాడు, ఆశ్రితులైన దేవ తలకోసం శ్రియఃపతియై, అవాప్తసమస్తకాముడై, నిత్యముక్తాను భావ్యుడై, పరాత్పరుడై ఉండే తన స్వభావాన్నిసైతం మార్చుకుని, వామనబ్రహ్మచారిగా అవతరించి, యాచకవృత్తిని కూడా చేసి, అన్నిలోకాలను తన శ్రీపాదస్పర్శతో ఉద్ధరించిన స్వామి, పరమ కృపతో వేగంగా వచ్చి, నా హస్తాన్ని గ్రహించి, కౌగలించుకునేట ట్లైతే, నీవు కలవాలి; అంటే – అతడు వేంచేసి, నన్ను కలిసేటట్లు నీవు అనుకూలించాలి – అని భావం.

**"వాట్టమిన్ఱి"**–పరమపదాన్ని వదలి, హేయమైన సంసార మండలంలోకి వచ్చానే! అనే కొరతను పొందకపోవడమే.

శ్రీగోదాదేవి నాచ్చియార్‌తిరుమొళిలోని ఏడవదశకంలో పాంచజన్యశంఖంతో సంభాషిస్తూ, కొంతసేపు ఒక విధంగా ప్రొద్దుపుచ్చింది. ఈమె ఎంతగా మొరపెట్టినా ఆ శంఖం సమాధానం ఏమీ పలుకలేదు. అందువల్ల భగవద్విశ్లేషం చేత కల్గిన ఆమె ఆర్తి అతిశయించింది. ఆ కాలం కూడా వర్షాకాలం. అపుడు తిరుమలపై ఆకాశంలో అంతటా మేఘాలు మెరుస్తూ, గర్జిస్తూ కన్పించాయి. ఆ మేఘాలతోపాటు, వాటి వర్ణం వంటి వర్ణాన్ని కల స్వామి వచ్చి ఉంటాడనే భావంతో గోదాదేవి "భగ వానుడు కూడా మీతో వచ్చాడా?" అని అంటూ వాటిని ప్రశ్నిం చింది. అవి బదులు ఏమీ పలుకలేదు. దాంతో మేఘాలను ఉద్దేశించి, "మీరు నా నాయకుడైన శ్రీవేంకటేశ్వరుని సన్నిధికి చేరి, నా దశను తెలియజేయండి" అని వేడుతున్నది. ఈ విధంగా మేఘాలను దూతగా పంపడమే ఈ దశక ప్రమేయం.

అందులోని ఈ మొదటిపాశురంలో "ఆకాశంలో అంతటా వ్యాపించి, ఉన్న ఓ మేఘాల్లారా! నాస్వామి అయిన శ్రీవేంకటేశ్వరుడుకూడా మీతోపాటు ఇక్కడకు వచ్చాడా?" అని గోదాదేవి మేఘాలను ప్రశ్నించగా, ఆ ప్రశ్నకు అవి ఏ సమా ధానం చెప్పకపోవడంతో, ఆమె కన్నీరు కార్చడం ప్రారంభించి, వాటితో "మేఘాల్లారా! నేను ఈ విధంగా కన్నీరు కారుస్తూ ఏడ్చేటట్లు నన్ను చేయడం అతనిగొప్పతనమా? మీరే చెప్పండి" అని అంటున్నది.

"ఆకాశంలో అంతటా ఆవరించిన, నీలవర్ణాన్ని కల మేల్‌కట్టు కట్టినట్లుగా కన్పించే మేఘాల్లారా! చాలా పరిశుద్ధం అయిన పుణ్యతీర్థాలు సదా ప్రవహించడంవల్ల చాల శీతలంగా,



మాముత్త నిది శొరియుమ్ మాముగిల్‌గాళ్!,
వేఙ్గడత్తు!
చ్చామత్తిన్ నిఱఙ్గొణ్డ తాళాళన్ వార్‌త్తై యెన్నే!,
కామత్తీయుళ్ పుగున్దు కదువప్పట్టు ఇడైక్కఙ్గుల్,
ఏమత్తోర్ తెన్ఱలుక్కు ఇఙ్గిలక్కాయ్ నా నిరుప్పేనే
(8-2)

నల్లనివర్ణంగల ఓ మేఘాల్లారా! మీరు నాకోసం ఔదార్యంలో ఇపుడు కొత్తగా పరిచయాన్ని కలుగ జేసికోవాలా! ఔదార్యాన్ని సహజంగానే కలవారు మీరు! వెలకట్టలేని గొప్పముత్యాలను, బంగారాన్ని ఎవరూ అడుగకుండానే మీరు వర్షిస్తారు కదా! అటువంటి మీరు మీ పాదాలపై పడి అర్థించే నాకోసం నోరు తెరచి కనీసం ఒక మాటైనా పలుకరాదా! శ్రీవేంకటేశ్వరుని సంగతి మీకు తప్పక తెలిసి ఉంటుంది. ఏదైనా చెప్ప కూడదా! ఆ స్వామివిషయంలో నాకు కల ఆ భక్తి అనే అగ్ని నా బాహ్యేంద్రియాలను నిశ్శేషంగా దహిస్తూ, ఇక దానికి ఎఱ చాలక పోవడంవల్ల నాలోపలకు కూడా ప్రవేశించి దహిస్తున్నది. మలయమారుతం దానికి సహకరిస్తూ బాధను అతిశయింపజేస్తోంది. ఈ రీతిలో ఈ రెండింటిచేతిలో చిక్కుకుని ఎంతకాలం తల్లడిల్లుతూ ఉంటాను?

సుందరంగా ఉండే శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే నా స్వామి, తనవర్ణంతో సమానమైన వర్ణాన్ని కల మీతో కలసి వచ్చాడా? ఏమి? పరమకరుణాకరుడైన అతనికి ఈ విధంగా నన్ను కన్నీటి పాలు చేయడం ఒక అతిశయమా? మీరే చెప్పండి"– అంటూ గోదాదేవి మేఘాలతో మొరపెడుతున్నది.

"ఓ మేఘాల్లారా! మీరు నాకోసం ఔదార్యంలో కొత్తగా పరిచయాన్ని పొందాలా? ఔదార్యాన్ని సహజసిద్ధంగా కలవారు కదా మీరు! అందువల్ల ప్రార్థించే నాకోసం నోరు తెరచి కనీసం ఒకమాట అయినా పలుకకూడదా! శ్రీవేంకటేశ్వరుని వృత్తాంతం మీకు తెలియకుండా ఉండదే! ఇతరులకు బంగారాన్ని, ముత్యా లను వర్షించే మీరు నాకు కనీసం నోటిమాటైనా పల్కడం అరుదా!" అని గోదాదేవి అంటున్నది.

దయ జూపే మేఘాల్లారా! "విరహంవల్ల నా దేహం లోని కాంతి, వర్ణం అన్నీ మారిపోయాయి. మనస్సు, నిద్ర నన్ను వదలిపెట్టిపోయాయి. నా సౌందర్యం రూపుమాసింది. ఇకపై ఒకక్షణంకూడా నేను జీవించి ఉండలేను"– అని గోదాదేవి విలపిస్తున్నది.

ఒళివణ్ణమ్ వళైశిన్దై ఉఱక్కత్తోడు ఇవై యెల్లామ్,
ఎళిమైయాల్ ఇట్టెన్నై యీడళియ ప్పోయినవాల్,
కుళిరరువి వేఙ్గడత్తు ఎన్ గోవిన్దన్ గుణమ్ పాడి,
అళియత్త మేగఙ్గాళ్! ఆవికాత్తిరుప్పేనే (8-3)

భగవానుని విశ్లేషంవల్ల అనుభవించిన దుఃఖంతో నా శరీరశోభ మారి, వర్ణం చెడి, గాజులు వదులై, మనస్సు తల్లడిల్లి, నిద్రలేకుండాపోయింది. ఈ విధంగా నా గొప్పతనం





అంతా నశించి, బాధపడే నా స్థితినిగూర్చి ఏమని చెప్పను? విశ్లేషసమయాల్లో నాయకుని కల్యాణగుణాలను కీర్తిస్తూ, ప్రాణాన్ని ధరించి ఉండాలని చూచినా, కాంతి, రంగు, గాజులు, మనస్సు పాడైపోయేటట్లుగా ఏర్పడిన ఈ దశలో గుణకీర్తనం చేసి, నా ప్రాణాన్ని రక్షించుకుని తట్టుకోవడం నాకు సాధ్యమా! మీరే చెప్పండి.

"ఆశ్రితులను రక్షించడంకోసం తన వాడిగోళ్లతో హిరణ్య కశిపుని వక్షఃస్థలాన్ని చీల్చిన స్వామి తనస్వభావాన్ని మరచి, అతనినే నమ్మిఉన్ననన్ను బాధపెడుతున్నాడు. నానుండి దోచుకుని పోయిన చేతిగాజులను నాకు తిరిగి ఇవ్వమని అతనిదగ్గరకు పోయి నా దురవస్థను అతనికి తెలియజేయండి"- అని తిరు మలలో గుంపులుగుంపులుగా సంచరించే మేఘాలతో శ్రీగోదా దేవి అంటున్నది.

వాన్ కొణ్డు కిళర్న్దెళున్ద మాముగిల్‌గాళ్!, వేఙ్గడత్తు
త్తేన్‌కొణ్డ, మలర్ శిదఱ త్తిరణ్డేఱి ప్పొళివీర్‌గాళ్!,
ఊన్ కొణ్డ వళ్ళుగిరాల్ ఇరణియనై ఉడలిడన్దాన్,
తాన్‌కొణ్డ శరివళైగళ్ తరుమాగిల్ శాఱ్ఱుమినే (8-5)

ఆకాశంలో అంతటా ఎక్కడ చూచినా మీరే అన్నట్లుగా వ్యాపించి, ఆకాశాన్ని కబళీకరించి, సంచరిస్తున్న మేఘాల్లారా! తేనె నిండిన చక్కనిపూలు చెదరిపడేరీతిలో హాని కల్గిస్తూ మీరు వర్షిస్తే ఏం ప్రయోజనం? ఇతరులకు బాధ కల్గించడమేనా మీకు పురుషార్థం? బాధపడేవారిని ఆనందసముద్రంలో మునిగే టట్లు మీరు చేయవద్దా? అనిష్టాన్ని తీర్చడంతో పాటు- ఇష్టాన్ని ప్రసాదించడం కూడా చేయవద్దా? విరహదశలో ఇపుడు నాకు అనిష్టం అయినపూలను చెదరిపడేటట్లు చేసినంతమాత్రంతో చాలదు. భగవత్‌సంశ్లేషం అనే ఇష్టప్రాప్తినికూడా కల్గిం చాలి. లోకాల కష్టాన్ని పోగొట్టడంకోసం క్రూరులైన అసుర సమూహాలను నశింపజేసి, హిరణ్యకశిపుని శరీరాన్ని తన నిశిత నఖాలతో చీల్చినస్వామి నా దగ్గర నుండి అపహరించుకుని పోయిన చేతిగాజులను నాకు తిరిగి ఇవ్వమని పల్కి, నా దురవస్థను అతనికి చెప్పండి.

స్వామి తాను అపహరించిన గాజులు తిరిగి ఇవ్వడం అంటే - ఆమె ప్రార్థనను మన్నించి, అనుగ్రహించడమే! స్వామి విరహార్తివల్ల శరీరం కృశించగా, గాజులు వదులై జారి పోయాయి. స్వామి అనుగ్రహిస్తే మళ్లీ శరీరం బలాన్ని పొంది, గాజులు నిలుస్తాయి- అని హార్దభావం.

తనను ఆశ్రయించిన దేవతలను రక్షించడంకోసం మహాబలిదగ్గరనుండి భూమిని స్వీకరించినస్వామి వేంచేసి ఉండే తిరుమలలోనే కదా మీరు వ్యాపించిఉన్నారు. ఏనుగులు తిన్న వెలగపండువలె నేను, నామనస్సు బాధపడేటట్లు నాలో ప్రవే శించి, నా వైలక్షణ్యాన్ని అంతటిని అపహరించిన నారాయణు నికి నా కష్టాన్ని తెలియజేయండి - అని గోదాదేవి మేఘాలను ప్రార్థించింది.

శ్రీవేంకటేశ్వరుణ్ణి నిరంతరం సేవిస్తూ, అందువల్ల మదించిన ఏనుగులవలె గర్వంగా తిరుమలలో సంచరించే మేఘాల్లారా! ఆదిశేషుని దగ్గరనుండి సకలకైంకర్యాలను స్వీక రించేటట్లే, నా దగ్గరనుండికూడా కైంకర్యాలను స్వీకరిస్తాదని నమ్మి ఉన్నాను. **"మా శుచః"** అనే అతనిమాటను సత్యం అని విశ్వసించాను.

ఈ చివరిపాశురంతో ఈ దశకాన్ని అభ్యసించినవారు పొందేఫలాన్ని గోదాదేవి తెలియజేస్తున్నది.

నాగత్తి న్నణైయానై నన్నుదలాళ్ నయన్దు ఉరై శెయ్
మేగత్తై వేఙ్గడక్కోన్ విడు తూదిల్ విణ్ణప్పమ్,
పోగత్తిల్ వళువాద పుదువైయర్‌కోన్ కోదై తమిళ్,
ఆగత్తు వైత్తురైప్పారవర్ అడియారాగువరే (8-10)

తాము ప్రార్థించినరీతిలో భగవదనుభవాన్ని పొంది, సంతోషించిన పెరియాళ్వార్లకుమార్తె అయిన శ్రీగోదాదేవి ఆది శేషునిపై శయనించి, యోగనిద్రలో ఉండే పరవాసుదేవుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి ఆశపడి, అనుగ్రహించిన మేఘదూతమైన

**ముసలితనం క్రమ్మి చావు చేరువైనపుడూ,**
**రోగములతో బాధపడునప్పుడు,**
**గొంతులో కఫము నిండినపుడు, బంధువులు మూగినపుడు,**
**నీ భజన చేయగలనో లేదో!**
**అందువలన ఇప్పడే నిన్ను భజించెదను.**



ఈ దశకాన్ని పఠించేవారు ఆస్వామి నిత్యకైంకర్యసామ్రాజ్యాన్ని పొంది, ఎల్లప్పుడూ సుఖిస్తారు.

గోదాదేవి భగవద్విరహాన్ని ఉపశమింపచేసికోవడం కోసం ఉద్యానవనానికి వెళ్ళింది. అక్కడ మల్లెపూవులు కంటికి కన్పించి, ఆమెబాధను ఇనుమడింపజేశాయి. అక్కడనుండి తన చూపును తప్పించి, ఆమె ఏదిక్కులో చూచినాగానీ, ఒక్కొక్కపూవు కంటికి కన్పించి, హింసించడం ప్రారంభించింది. అంతటితో గోదాదేవి కన్నులు మూసుకొన్నది. ఆమె కన్నులు మూసికొన్నదే తప్ప, ఆమెబాధ ఏమీ తగ్గలేదు. చెవి మూసికొనలేకపోవడంవల్ల కోయిలలపాటలు వెంటనే ఆమెచెవికి సోకాయి.



వాటిని విని భరించలేకపోవడంవల్ల ఆమె ఆ కోయిలలను చూచి, "ఎందుకు మీరు ఈ విధంగా కర్ణకఠోరంగా అరుస్తున్నారు? చాలు! చాలు! మీరు పాడినఅందం చాలు! దయచేసి నిలపండి!" అని అంటున్నది.

**పాడుమ్ కుయిల్గాళ్! ఈదు ఎన్న పాడల్?, నల్వేఙ్గడ**
**నాడర్ నమక్కు ఒరు వాళ్వు తన్దాల్ వన్దు పాడుమిన్,**
**ఆడుమ్ కరుళిక్కొడియుడైయార్ వన్దు అరుళ్ శెయ్దు,**
**కూడువరాయిడిల్ కూవినుమ్ పాట్టుక్కళ్ కేట్టుమే (10-5)**

ఒళ్ళు తెలియకుండా పాడుతున్న కోయిలలారా! కర్ణ కఠోరంగా ఉన్న మీ ఈ కూతలు ఇకచాలు. నిలపండి. ఇవేమి పాటలు? ఈ కాలంలోనా పాడడం? చాలు! చాలు! మీ పాట అందం! నిలపండి. మీ పాటలు వినే స్థితిలోనా నేను ఉన్నాను? అయ్యో! ఏమి పాట! ఏమి పాట! పాపిష్ఠుల్లారా! పాడింది చాలు! ఇప్పటికి చాలు! కోపించకండి.

భగవానుడు అనుగ్రహించి, ఇక్కడికి వేంచేసి, నన్ను ఆలింగనం చేసికొని, ఉజ్జీవింపజేసేకాలం వస్తే, అపుడు మీరూ ఇక్కడికి వచ్చి, మీఆశ తీరేటట్లు పాడండి.

"శ్రీవేంకటేశ్వరుడు వచ్చి, నీకు ఉజ్జీవనం కల్గించే సమయం మాకు ఏవిధంగా తెలుస్తుంది?" అని అంటారా! స్వామి రాకకు సూచకంగా గరుడుడు తనరెక్కలను విస్తరించి, నర్తిస్తూ వస్తాడు. ఆ గుర్తు చూచే మీరు గ్రహించవచ్చు. ఒకవేళ మీరు తెలుసుకోలేకపోయినా, అపుడు నేనే మిమ్ములను రప్పించి, మీపాటను వింటాను. మీరు సందేహపడవద్దు.

గోదాదేవి వర్షాన్ని కురవబోయేమేఘాలను చూచి, తన విరహార్తి జ్వలించడం ప్రారంభించగానే సహించలేక, వాటితో ఈ విధంగా అంటున్నది.

**మళైయే మళైయే మణ్ పుఱమ్ పూశి ఉళ్ళాయ్ నిన్ఱు,**
**మెళుకూట్రినాఱ్పోల్ ఊట్రు నల్ వేఙ్గడత్తుళ్ నిన్ఱ,**
**అళకప్పిరానార్ తమ్మై ఎన్నెఞ్జత్తగప్పడ**
**త్తళువి నిన్ఱు,ఎన్నై త్తదైత్తుక్కొణ్డు ఊట్రవుమ్ వల్లైయే(10-8)**

ఇలా మధురభావభక్తిప్రణయదీపిక ఆండాళ్తల్లి గోవిందుణ్ణి ఎంతో ఆర్తితో, తన్మయత్వంతో పాశురగానం చేసి, తాను తరించి మనల్ని తరింపజేసింది. 





# భగవద్రామానుజుల విశిష్టాద్వైతం

- డా॥ ముదివేడు ప్రభాకరరావు



**యో నిత్య మచ్యుత పదాంబుజయుగ్మరుక్మ -
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

ఎల్లప్పుడూ ఏకాగ్రచిత్తంతో అచ్యుతుడైన విష్ణు పాదార విందాలయందే నిమగ్నుడై ఉండేవాడూ, ఈ భౌతిక ప్రపంచంలో అనుక్షణం మనస్సును ఆకర్షించే తదితరవిషయాలను గడ్డి పోచతో సమానంగా త్యజించినవాడూ, అస్మదీయగురువూ, దేవుడూ, దయాసముద్రుడూ అయిన శ్రీరామాను జాచార్యుల చరణారవిందాలను భక్తిప్రపత్తులతో శరణాగతి పొందుతున్నాను.

## ప్రాశస్త్యం

"సమస్తలోకాల సృష్టి-స్థితి-లయాలు లీలా మాత్రంగా నిర్వహించేవాడూ, వినయంతో నమస్క రించే ప్రాణికోటిని రక్షించడంలో దీక్షాబద్ధకంక ణుడూ, వేదాలకు శిరస్సయిన ఉపనిషత్తుల్లో నిలిచి ప్రకాశించే శ్రీశ్రీనివాసపరబ్రహ్మంలో నా బుద్ధి విశేషం భక్తిరూపమైనదై వెలుగొందుగాక!". అని రామానుజుల శ్రీభాష్యమంగళాచరణశ్లోకం (1-1-1)లోని తాత్పర్యం.

## ప్రాభవం

భారతదేశంలో నాల్గుమతసంప్రదాయాలు అతి ప్రాచీనమైనవి. అవి, శ్రీసంప్రదాయం, బ్రహ్మ సంప్రదాయం, రుద్రసంద్రాయం, సనకసంప్రదాయం. ఇందులో శ్రీసంప్రదా యాన్ని శ్రీరామానుజులు స్వీకరించారని 'ప్రమేయరత్నావళి'లో చెప్పబడింది.

**రామానుజం శ్రీః స్వీచక్రే - మధ్వాచార్యం చతుర్ముఖః
శ్రీవిష్ణుస్వామినం రుద్రో - నింబాదిత్యం చతుస్సనః॥**

రామానుజులు శ్రీసంప్రదాయాన్ని, మధ్వాచార్యులు బ్రహ్మసంప్రదా యాన్ని, విష్ణుస్వామి రుద్రసంప్రదాయాన్ని, నింబాదిత్యుడు సనకసంప్రదాయాన్ని స్వీకరించారు.

ఇందుచే తత్పూర్వమున్న 'వైష్ణవం' రామానుజులచేతిలో **'శ్రీవైష్ణవం'** అయింది. ఆయన రచించిన బ్రహ్మసూత్రాల భాష్యం **'శ్రీభాష్యమ్'** అయింది. శ్రీరామానుజులు స్థాపించినది **'సశ్రీక వైష్ణవం'** లక్ష్మీసహితమైన, లక్ష్మీతో కూడుకొన్న వైష్ణవం. ఎందుకంటే, స్వామి 'శ్రీనివాసుడు', కనుక, వక్షఃస్థలంలో అమ్మవారిని 'వ్యూహలక్ష్మి'గా ప్రతిష్ఠింపజేసినది- శ్రీరామానుజులే కనుక- శ్రీరామానుజులు శ్రీసంప్రదాయప్రవర్తకుడైనాడు. అమ్మవారు, స్వామివారితో కలసి మెలసి విడదీయరాని బంధంగా (నిత్యానపాయినీ) ఉన్న **నిత్యదాంపత్య తత్త్వమే శ్రీసంప్రదాయం.**

## సంప్రదాయం - సిద్ధాంతం

'శ్రీవైష్ణవం' అనేది సంప్రదాయం - విశేషించి, 'భక్తి సంప్రదాయం', 'విశిష్టాద్వైతం' అనేది సిద్ధాంతం విశేషించి, విష్ణుమత సిద్ధాంతం.

విష్ణుభక్తిసంప్రదాయాన్ని పన్నెండుమంది ఆళ్వారులు పాడిన నాల్గు వేల పాశురాల (క్రీ.శ.5-8 శతాబ్దాల మధ్య) సంపుటియైన నాలాయిర దివ్యప్రబంధం క్రోడీకరించింది. ఇది మొట్టమొదటి ఆచార్యుడైన నాథముని (క్రీ.శ. 823-900) చేసిన సంకలనం. ఆయనతో ఆచార్య పరంపర ప్రారంభ మైనది. ఆచార్యులలో మూడవవారైన శ్రీరామానుజులచే (క్రీ.శ. 1017-1137) ఆళ్వారుల భక్తిసంప్రదాయం పునాదికాగా, 'విశిష్టాద్వైత'మనే విష్ణు మత సిద్ధాంతసౌధం నిర్మించబడింది.

## ఉభయవేదాంత ప్రవర్తకుడు

విశిష్టాద్వైతం రెండు సంప్రదాయాలకు సంగమస్థానం. 1)శ్రీవైష్ణవం 2)వేద-ఉపనిషత్తుల మార్గం. ఒకటి దాక్షిణాత్యం. రెండవది ఔత్తరాహం. నమ్మాళ్వారుల తిరువాయ్‌మొళి తదితర గ్రంథాలలో విశిష్టాద్వైత సిద్ధాంతానికి మూలబీజాలున్నాయి. శ్రీరామానుజులు చేసిన మరో ఘనకార్యం- వేద, ఉపనిషత్తులతో పాటుగా పాంచరాత్ర ఆగమాలు-పురాణాలు-ఆళ్వార్ల దివ్య ప్రబంధాలతో సమన్వయించడం. ఆళ్వార్ల ప్రవాహరూపమైన భక్తి సంప్ర

దాయాన్ని–వేదవాఙ్మయంతో సమన్వయించి 'శ్రీభాష్యాన్ని' తీర్చిదిద్దడంచేత ఆయన ఉభయవేదాంత ప్రవర్తకుడైనాడు.

### ప్రస్థానత్రయం

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత–ఈ మూడు గ్రంథాలకు **'ప్రస్థానత్రయ'** మని పేరు. అంటే వేదాంత ప్రస్థానత్రయం. వేదాంతమంటే నాల్గువేదాలకు చివరగలదైన ఉపనిషత్తులని అర్థం. ఈ మూడింటికి సంస్కృతంలో స్వతంత్ర భాష్యం వ్రాసిన వానినే 'ఆచార్యు'డని పిలుస్తారు.

### ఆచార్యుడంటే....?

**ఆచినోతి హి శాస్త్రార్థాన్ - ఆచారే స్థాపయత్యపి ।**
**స్వయమాచరతే యస్తు- స ఆచార్య ఇతి స్మృతః ॥**

–అని ఆచార్య శబ్దానికి నిర్వచనం. మొదట తాను చక్కగా ఒక గురువు సన్నిధిలో శాస్త్రాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి ఉండాలి. సుదీర్ఘ అధ్యయన ఫలితంగా తానొక ఆచారాన్ని, సంప్రదాయాన్ని ఆలోచన విధానాన్ని లోకంలో స్థాపించాలి. తాను ప్రవచించిన స్వతంత్ర ఆలోచనను ఆచరించి లోకానికి చూపించాలి. ఈ మూడు కార్యాలు త్రికరణ శుద్ధిగా చేసిన వానినే 'ఆచార్యు'డని పిలుస్తారు.

### విశిష్టాద్వైతానికి గల వివిధ నామధేయాలు

1)ఎంబెరుమానార్ దరిశనమ్ 2)శ్రీరామానుజ దర్శనం 3)యతీంద్రమతం 4)యతిపతి మతం 5)రామానుజ మతం/ రామానుజ సిద్ధాంతం 6)విష్ణు భక్తిమతం 7)విశిష్టాద్వైతం.



సాక్షాత్ శ్రీరంగనాథుడే (నంబెరుమాళ్), శ్రీరామానుజుల శ్రీభాష్యానికి 'ఎమ్బెరుమానార్ దరిశనమ్' అనే పేరును పెట్టారని శ్రీమణవాళ మహామునులు తమ 'ఉపదేశ రత్నమాల' అనే గ్రంథంలో ఇలా వ్రాశారు.

**'ఎమ్బెరుమానార్ దరిశనమ్' మెన్టే యిదక్కు**
**నమ్బెరుమాళ్ పేరిట్టి నాట్టివైతార్, అమ్బువియోర్**
**ఇన్ద దరిశనత్తై యెమ్బెరుమానార్ వళర్త**
**అన్ద చ్చెయలఱిగైక్కా॥**

గోష్ఠీపురం దేవాలయ గోపురం ఎక్కి, గురువు గోష్ఠీపూర్ణులు ఉపదేశించి 'ఓం నమో నారాయ ణాయ' అనే అష్టాక్షరీ మంత్రాన్ని అందరికీ ఉపదేశించడం చేత, గురువుగారు **'ఎమ్బెరుమా నారేవారుమ్'** (నన్ను పాలించే దేవుడా! రావయ్యా!) అని ప్రేమతో కౌగిలించుకొన్నప్పటి నుండి రామానుజులకు **'ఎమ్బెరుమానార్'** అనే పేరు స్థిరపడింది. 'నమ్బెరుమాళ్' అంటే శ్రీరంగంలోని శ్రీరంగనాథుడు. సకల సంసారి చేతనులు ఉజ్జీవించాలనే పరమకృపతో విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని స్థాపించడం వలన నంబెరుమాళ్లయిన శ్రీరంగ నాథులు రామానుజ సిద్ధాంతాన్ని **'ఎమ్బెరుమా నార్ దరిశనమ్'** అని ప్రశంసించారు.

కంచిలోని వరదరాజస్వామివారు శ్రీరామానుజులను **'యతిరాజ'**, అని పిలువగా, సన్యాసాశ్రమం స్వీకరించిన వేళ తిరుక్కచ్చినంబి **'యతీంద్ర'** అని పిలిచారు. తిరుపతి వాస్తవ్యులైన శ్రీనివాసాచార్యులనేవారు **'యతీంద్రమతదీపిక'** లేక **'యతి పతిమతదీపిక'** అనే గ్రంథంలో విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రకాశింప జేశారు.

శ్రీమద్రామానుజుల అభిప్రాయమే 'భాష్య' రూపంగా వెలువడింది. అందమైన 'రామాను జమతాన్నే' అన్నమయ్య స్వీకరించాడు. 'భక్తి చేత ముక్తి'ని స్థాపించే విష్ణుభక్తిమతమే విశిష్టాద్వైతం.







# రాయలు చిత్రించిన గోదాకల్యాణం

– డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ

క్రీ.శ.776లో కర్కాటమాసం పుబ్బానక్షత్రంలో గోదాదేవి జన్మించిందని సంప్రదాయజ్ఞుల విశ్వాసం. అయోనిజయైన గోదాదేవి తులసితోటలో పాలగచ్చు తిన్నెమీద లభించింది. ఆమె అరికాళ్ళు, అరచేతులు, ముఖం పద్మరాగాలని ఆ శుభాంగినిని అభివర్ణించాడు–రాయలు. ఆ సమయంలో విష్ణుచిత్తుని ధర్మపత్నికి పాలిండ్లనుండి పొంగిన పాలు గోదకు కడుపునింపింది. బిడ్డలులేని ఆ దంపతులకు విష్ణుదేవుని కటాక్షంవల్లనే కూతురై గోదాదేవి లభించింది. అందుకు ఈ అంశం ఒక అద్భుత తార్కాణం. క్రమంగా ఆమెలో యౌవనం అంకురించింది.

ఆమెకు పూర్వజన్మలో చెలులైన నాగకన్యలు మరాళి, హారిణి, స్రగ్విణి పేర్లతో పొరుగిండ్లలో జన్మించారు. త్రైకాలిక జ్ఞానవంతులైన ఋషులు ఆమెను భూమాదేవి అని చెప్పారు. కానీ చెలికత్తెలు గోద సత్యాదేవి (5-74) అవతారమని కొనియాడారు. అందరిలా బొమ్మల పెండ్లిండ్లలో లక్ష్మీకల్యాణగీతాలను గోదాదేవి ఆలపించింది. స్వామికల్యాణగుణములకు ఉప్పొంగి, తాను శ్రీమన్నారాయణునే వివాహమాడాలని నిశ్చయించుకొంది. శ్రీహరిఅవతారచరిత్రలను ఆలకించి పరవశించిపోయేది.

విష్ణుచిత్తుడు తన ఇంట సిరిసంపదలున్నా, నిగర్వియై శ్రీవారితోమాలలు, పూమాలలు తానే సమకూర్చుకొనేవాడు. తండ్రి స్నానానికి వెళ్ళినప్పుడు గోదాదేవి ఆ మాలికలు శ్రీహరికి సమర్పించడానికి ముందే తన కొప్పులో ధరించేది. పెరటిలో ఉన్న బావినీళ్ళలో తన ప్రతిరూపాన్ని చూసుకొని మురిసిపోయేది.

ఇలా గోదాదేవి తన నీడను తృప్తిగా నీళ్ళలో చూసుకొని, మరలా పూలబుట్టలో పూదండలను ఉంచేది. భగవంతుని పూమాలికలు తాను ముందుగా ధరించాననే అపరాధభావం గోదలో కనిపించదు. కారణం ఆమె మానసికంగా తనను స్వామికి అర్పించుకొన్నది.

గోదాదేవిమనస్సు స్వామికై పరితపిస్తోంది. అందుకనే చెలికత్తెలతో – స్వామి ప్రతియుగంలో వామన, పరశురామ, రామాది రూపాలెత్తి ఆడవాళ్ళను విరహంలో ముంచెత్తాడు. అంతకుముందున్న మత్స్య – కూర్మ – వరాహాది రూపాల్లోనే శాశ్వతంగా ఉండవచ్చు కదా! "ఆత్మవత్ సర్వభూతాని" తనవలె ఇతరకాంతలు స్వామివిరహంతో వేదన పొందారని విస్తారంగా నిందిస్తుంది. ఇలా సాగిన గోదాదేవి దివ్యభావన ఆమె హృదయ సౌకుమార్యాన్ని ఆవిష్కరిస్తుంది.



గోదాదేవి ప్రతిదినం వేకువతో మేల్కొనేది. జలక మాడటం, ద్రావిడవేదాన్ని పఠించి గుడిలో స్వామికి నమస్కరించడం, తిన్నెపైన పంచవర్ణాలు ముగ్గులు పెట్టడాన్ని రాయలు మనోహరంగా వర్ణించారు. అంతే కాదు ఆమె స్వయంగా తాను సిద్ధంచేసిన చెంగల్వపూమాలలను స్వామికి అర్పించడం, దీపారాధనం చేసి, అగరుధూపం సమర్పించేది. చక్కెర, కపిలగోవు నెయ్యి, అరటిపండ్లుతో స్వయంగా నివేదించేది. పోకచెక్కలతో, శొంఠి ముక్కలతో తాంబూలాన్నిచ్చి, స్వామికి కర్పూరనీరాజనం సమర్పించేది.

గోద మౌనంగా శ్రీహరిని మధురంగా తనలో తానే ఒంటరిగా, గానం చేసింది. అయితే ఈ గానం పవిత్రత, దానిలోని ఫలం, పరమార్థం మనకు తెలియాలి కదా! అందుకని రాయలు మాలదాసరికథను మధ్యలో పొదిగాడు. బ్రహ్మ రాక్షసుడికి-దాసరికి మధ్యలో చర్చద్వారా వెలలేని శ్రీహరిసంకీర్తన ఫలాన్ని తేటతెల్లం చేశాడు. గోదాదేవికీర్తనల మహిమను రాయలు ఈ కథద్వారా సహృదయుల మనసులో నాటుకొనేలా రూపొందించాడు. ఇక గోదాదేవి శ్రీరంగనాథుణ్ణి సేవించింది. విష్ణుచిత్తుడు ఎంతటి ధర్మనిష్ఠుడో అంతటి విశిష్టాద్వైతమతానుయాయి. వైష్ణవాచారదీక్షితుడు. స్వామి తమకంతో గోదాదేవిని లోగొని ఆమె స్థానంలో మాయావధూటిని కల్పిస్తాడు. పల్లకి ఎక్కింది గోదాదేవి అనుకొంటాడు. తన బిడ్డను రంగనాథుడే స్వీకరించడంతో విలవిలలాడుతాడు. అప్పుడు **"భాగవత క్షోభంబునకు భువన భర్తయు భయంపడి, తచ్ఛాందసంబునకు గేలిసేయుచున్నవాడను భావం బతనికి తోప"** విష్ణుచిత్తుని స్వామి మందలిస్తాడు. రంగయ్య ఏమీ తెలియనట్లు విడిదిలో ఆమెను ఎప్పటిలా ఉంచుతాడు.

శ్రీకృష్ణదేవరాయలు గోదాదేవి కథను సంప్రదాయ భావబంధురంగా, కవితారీతిలో సమర్పించాడు. ఎక్కడా అనౌచిత్యం లేకుండా గోదాకథలో మార్పులు రేఖామాత్రంగా చేశాడు. కావ్యాదిలో లక్ష్మీవేంకట భర్తను ఎలా మణులతో వర్ణించాడో, గోదానాథుడైన రంగనాథుని కల్యాణఘట్టంలో సర్వాంగాల అలంకరణలతో వర్ణించాడు.

**ప్రణయరూపానికి, ప్రణవరూపానికీ స్వర్ణసేతువుగా నిలిచిన తిరుప్పావై పాశురాల రూపకర్త్రి గోదాదేవి. 12మంది ఆళ్వారుల్లో ఏకైకమహిళామతల్లి.**

'ఓ విష్వక్సేనా! రుద్రా! బ్రహ్మదేవా! శ్రీరంగనాథుడికి నా కుమార్తెను ఇచ్చే భాగ్యం కలిగింది. భృగుమహర్షిలా, సముద్రునిలా నేను ధన్యుడను. మేము లోకంలో చులకన కాకూడదు. అందుకని మా ఇంటికి అల్లుడిలా వచ్చి కన్యాదానాన్ని పొందడం ఆయనకే గౌరవం' అన్నాడు. విష్ణుచిత్తునికోరికను విశ్వభర్త మన్నించాడు. గరుడవాహనంపై విడిదికి చేరాడు. దేవాంగనల చేతులమీదుగా మంగళస్నానాన్ని, మైపూతలను అందుకున్నాడు. పీతాంబరాన్ని కట్టి, దివ్యాభరణాలు ధరించాడు. షోడశోపచారాలందుకొన్నాడు. రంగనాథస్వామి చేసిన మంగళస్నానం, తిరుమలేశుని శుక్రవారాభిషేకాన్ని తలపిస్తుంది. బహుశా, రాయలు తాను సందర్శించిన తిరుమలశ్రీవారిఅభిషేకప్రభావంతో ఈ రచన చేసి ఉంటాడు.

కల్యాణ సుముహూర్తవేళ తెరదించగా వధూవరులు జీలకర్రబెల్లం ఒకరి శిరస్సుపై ఒకరుంచారు. ముందుగా గోద రంగనాథుని శిరస్సుపై ముత్యాల తలంబ్రాలు పోసింది. ఆమెచివుళ్లవంటి చేతులు స్వామి ఫాలభాగంపై తగిలాయి. ఆ స్పర్శకు స్వామి తిరుమేను చెమర్చింది. చెమటతో కలిసిన ముత్యాలు జాలువారుతుంటే మేఘంనుండి రాలే వడగళ్లవానలా గోచరించింది. ఆమె ముగ్ధనాయిక. సిగ్గుతో ఆమె చేతులుకొద్దిగా ఎత్తి, ముత్యాలను పైకి ఎగచిమ్మింది. ఆమె తనువు సిగ్గుతో పులికితమైనప్పుడు ఆమె మెడలో స్వామి మంగళసూత్రాన్ని కట్టాడు. పతిదీర్ఘాయువుకు చేసే లాజహోమం, సఖ్యసిద్ధికి సప్తపది, పాతివ్రత్య రక్షణకు, అన్యోన్యదాంపత్యానికి అరుంధతీదర్శనం చేయడంతో కల్యాణం పరిపూర్ణమౌతుంది. ఈ కల్యాణం అచ్చం తెలుగువాళ్లింటి కల్యాణం. ఆచార్య వ్యవహారాలన్నీ తెలుగువాళ్లవే రాయలు పేర్కొన్నాడు.

గోదాదేవి, గాథలోని రాయల శృంగారవర్ణన మధురభక్తికి నిలువెత్తు రత్నదర్పణం. కల్యాణగాథలో శ్రీరంగనాథుని స్వరూపవర్ణన మధురభక్తిచే పొందే భాగవతునిదివ్యానుభూతికి మణిదర్పణం. గోదా శ్రీరంగేశుల ప్రణయం పరిణయంతో సుఖాంతమవుతుంది.







# వైకుంఠ ఏకాదశి ప్రత్యేకం! కేశవాది రూపాలు!!



05

**ఓం విష్ణవే నమః** (పద్మం-శంఖం-చక్రం-గద)

జ్ఞానానందాది సమస్తగుణాలతో, దేశతః, కాలతః వ్యాప్తుడైనందువల్లా, సర్వోత్తముడై ఉన్నందువల్లా శ్రీహరి 'విష్ణువు' అనబడుతున్నాడు.

ఈ విష్ణువు వాసుదేవ మహా మంత్రంలోని 'గ' అన్న అక్షరానికీ, గాయత్రిలోని 'వ' అన్న అక్షరానికీ, కర్ణతత్త్వానికీ, చైత్రమాసానికీ, శుక్లపక్షంలో ఉదరం యొక్క దక్షిణపార్శ్వంలో ధరించే నామానికీ, సింహరాశికీ, పాలకూ నియామకుడు.



06

**ఓం మధుసూదనాయ నమః** (శంఖం-పద్మం-గద-చక్రం)

'మధు' నామక దైత్యుడిని సంహరించినందువల్లా, సాత్త్వికలోకానికి సుఖాన్ని ప్రసాదించేవాడైనందువల్లా శ్రీహరి 'మధుసూదనుడు' అనబడుతున్నాడు. ఈ మధుసూదనుడు వాసు దేవ మహామంత్రంలోని "వ" అన్న అక్షరానికీ, గాయత్రిలోని "రే" అన్న అక్షరానికీ, త్వక్ తత్త్వానికీ, వైశాఖమాసానికీ, శుక్లపక్షంలో కుడిస్తనంమీద ధరించే నామానికీ, కన్యారాశికీ, మధురభక్ష్య విశేషానికీ నియామకుడు. ఈ మధుసూదనుడు 'హస్తిని' నాడిలో ఉంటాడు.



07

**ఓం త్రివిక్రమాయ నమః** (గద-చక్రం-శంఖం-పద్మం)

మూడు వేదాలనూ, మూడు కాలాలనూ, సత్త్వాది మూడు గుణాలనూ, భూరాది మూడు లోకాలనూ, త్రివిధ జీవులనూ, చేతన అచేతన, మిశ్రములన్న త్రివిధద్రవ్యాలనూ తన స్వరూపంతో వ్యాపించి నెలకొన్న కారణంగా శ్రీహరి 'త్రివిక్రముడు' అనబడుతాడు. ఈ త్రివిక్రముడు 'ఓం నమో భగవతే వాసు దేవాయ' మహామంత్రంలోని "తే" అన్న అక్షరానికీ, గాయత్రిలోని "ణి" అన్న అక్షరానికీ, నేత్రతత్త్వానికీ, జ్యేష్ఠమాసానికీ, శుక్లపక్షంలో కుడిభుజంమీద ధరించే నామానికీ, తులారాశికీ, వెన్నకూ నియామకుడు.



08

**ఓం వామనాయ నమః** (చక్రం-గద-పద్మం-శంఖం)

అపేక్షితసుఖాలనూ, అభీష్టాలనూ కరుణించేవాడూ, మోక్ష విరోధులైన దైత్యులను అంధకారంలోకి నెట్టివేసేవాడూ ఐనందువల్ల, శ్రీహరి 'వామనుడు' అనబడుతున్నాడు. ఈయన వాసుదేవ మహామంత్రంలోని 'వా' అన్న అక్షరానికీ, గాయత్రిలోని 'యం' అన్న అక్షరానికీ, జిహ్వాతత్త్వానికీ, ఆషాఢమాసానికీ, శుక్ల పక్షంలో కంఠం కుడివైపున ధరించే నామానికీ, వృశ్చికరాశికీ, పెరుగుకూ నియామకుడు.




# వైకుంఠ ఏకాదశి ప్రత్యేకం! కేశవాది రూపాలు!!




### ఓం శ్రీధరాయ నమః (చక్రం-గద-శంఖం-పద్మం)

శ్రీ శబ్దవాచ్య అయిన మహాలక్ష్మికి కూడా ధారణకర్తా, పోషణకర్తా అయినందువల్లా, లక్ష్మిని సర్వదా తన వక్షఃస్థలంలో ధరించి ఉండడం చేతా శ్రీహరి 'శ్రీధరుడు' అనబడుతున్నాడు. ఈయన వాసుదేవ మహామంత్రంలోని "సు" అన్న అక్షరానికీ, గాయత్రి లోని 'భ' అన్న అక్షరానికీ, ఘ్రాణతత్త్వానికీ, శ్రావణమాసానికీ, శుక్లపక్షంలో ఉదరం ఎడమభాగంలో ధరించే నామానికీ, ధనుర్రాశికీ, ముద్దపప్పుకూ నియామకుడు.

### ఓం హృషీకేశాయ నమః (చక్రం-పద్మం-శంఖం-గద)

ఇంద్రియనియామకుడూ, రమ, బ్రహ్మ, రుద్రాదులకు ఆనందాన్ని ఇచ్చే వాడూ అయినందువల్ల శ్రీహరి 'హృషీకేశుడు' అనబడుతున్నాడు. ఈయన వాసుదేవ మహామంత్రంలోని "దే" అన్న అక్షరానికీ, గాయత్రిలోని 'ర్గో' అన్న అక్షరానికీ, వాక్‌తత్త్వానికీ, భాద్రపదమాసానికీ, శుక్లపక్షంలో ఎడమభుజంమీద ధరించే నామానికీ, మకరరాశికీ, ఆకుకూరలతో తయారుచేసిన పదార్థాలకూ నియామకుడు.







### ఓం పద్మనాభాయ నమః (పద్మం-చక్రం-గద-శంఖం)

నాభిలో పద్మాన్ని కలిగినవాడూ, భక్తులమనస్సుల్లో ప్రకాశించేవాడూ, సూర్యకాంతివంటి కాంతిగలిగినవాడూ అయినందువల్ల శ్రీహరి 'పద్మనాభుడు' అనబడుతాడు. ఈయన వాసుదేవ మహామంత్రంలోని "వా" అన్న అక్షరానికీ, గాయత్రిలోని "దే"అన్న అక్షరానికీ, పాణితత్త్వానికీ, ఆశ్వయుజమాసానికీ, శుక్ల పక్షంలో కంఠం ఎడమభాగంలో ధరించే నామానికీ, కుంభరాశికీ, కూరగాయ లతో తయారుచేసే పదార్థాలకీ నియామకుడు.

### ఓం దామోదరాయ నమః (శంఖం-గద-చక్రం-పద్మం)

యశోదచేత పొట్టకు బిగించబడిన తాడుగలవాడూ, ఇంద్రియ నిగ్రహం కలిగిన ఋషులతో క్రీడించేవాడూ, దానశీలురకు ఆనందాన్ని ఇచ్చే వాడూ, దైత్యులకు దుఃఖం కలిగించేవాడూ,దయాయుక్తులైన జీవులతో క్రీడించే వాడూ అయినందువల్ల శ్రీహరి 'దామోదరుడు' అనబడుతున్నాడు. ఈయన వాసుదేవ మహామంత్రంలోని "య" అన్న అక్షరానికీ, గాయత్రి లోని "వ" అన్న అక్షరానికీ, పాదతత్త్వానికీ, కార్తికమాసానికీ, శుక్లపక్షంలో మెడపైన ధరించే నామానికీ, మీనరాశికీ, అన్ని రకాల పుల్లని పదార్థాలకీ నియామకుడు.

# వైకుంఠ ఏకాదశి ప్రత్యేకం! కేశవాది రూపాలు!!




### ఓం సంకర్షణాయ నమః (శంఖం-పద్మం-చక్రం-గద)

భక్తులచిత్తాన్ని ప్రాపంచిక విషయాలనుండి మరలించి వైరాగ్య భావాన్ని కరుణించేవాడైనందువల్ల శ్రీహరి 'సంకర్షణుడు' అనబడుతున్నాడు. ఈయన గాయత్రిలోని 'స' అన్న అక్షరానికీ, పాయుతత్త్వానికీ, కృష్ణపక్షంలో నుదుటిపై ధరించే నామానికీ, ఆమ్లమిశ్రమాలు కాని పదార్థాలకీ, మనోమయ కోశానికీ, క్షత్రియ వర్ణానికీ, స్త్రీ శరీరానికీ, ఋతుసామాన్యానికీ, రుద్రునికీ, మధ్యాహ్నసవనానికీ, ఆవేశరూపాలకూ, రాజసద్రవ్యాలకూ, త్రేతా యుగానికీ, శరదృతువుకూ నియామకుడు.




### ఓం వాసుదేవాయ నమః (శంఖం-చక్రం-పద్మం-గద)

త్రిలోకాలకూ ఆవాసస్థానమైనవాడూ, సర్వాంతర్యామీ, సర్వశక్తుడూ, సర్వచేష్టకుడూ, సర్వాభీష్టప్రదుడూ, యోగ్యజీవులకు ముక్తిని అనుగ్రహించే వాడూ, వసుదేవసుతుడూ అయినందువల్ల శ్రీహరి వాసుదేవుడు అనబడు తున్నాడు. ఈయన గాయత్రిలోని "ధీ" అన్న అక్షరానికీ, ఉపస్థతత్త్వానికీ, కృష్ణ పక్షంలో ఉదరమధ్యంలో ధరించే నామానికీ, పంచదారకూ, బెల్లానికీ, బ్రాహ్మణ వర్ణానికీ, పురుషశరీరానికీ, సాయంసవనానికీ, అవతారరూపాలకూ, శుభ్ర ద్రవ్యాలకూ, కృతయుగానికీ, హేమంతఋతువుకూ నియామకుడు.




### ఓం ప్రద్యుమ్నాయ నమః (శంఖం-గద-పద్మం-చక్రం)

అసదృశమైన కాంతీ, యశస్సూ కలిగి ఉన్నందువల్ల శ్రీహరి "ప్రద్యుమ్నుడు" అనబడుతున్నాడు.

ఈయన గాయత్రిలోని 'మ' అన్న అక్షరానికీ, శబ్దతత్త్వానికీ, కృష్ణ పక్షంలో హృదయభాగంలో ధరించే నామానికీ, వడపప్పు మొదలైన పదార్థా లకూ, వైశ్యవర్ణానికీ, స్త్రీ శరీరానికీ, అయనానికీ, ప్రాతఃసవనానికీ, లీలారూపా లకూ, పీతవర్ణద్రవ్యాలకూ, ద్వాపరయుగానికీ, వర్షఋతువుకూ నియా మకుడు.




### ఓం అనిరుద్ధాయ నమః (గద-శంఖం-పద్మం-చక్రం)

ఎవ్వరిచేతా నిరోధించబడనివాడూ, సర్వశక్తుడూ, గుణపూర్ణుడూ, మనస్సుతో సంపూర్ణంగా తెలియబడనివాడూ, జ్ఞానుల మనసులలో ధ్యానంతో బంధించబడేవాడూ, వేదవిరుద్ధ ఆచారనిరతులను సంహరించేవాడూ అయి నందువల్ల శ్రీహరి 'అనిరుద్ధుడు' అనబడుతున్నాడు. ఈయన గాయత్రిలోని 'హి' అన్న అక్షరానికీ, స్పర్శతత్త్వానికీ, కృష్ణపక్షంలో కంఠమధ్యభాగంలో ధరించే నామానికీ, చేదుపదార్థాలకూ, శూద్రవర్ణానికీ, అన్నమయకోశానికీ, భోగ్య వస్తువులన్నింటికీ, అబ్దానికీ, నల్లనిద్రవ్యాలకూ, కలియుగానికీ, గ్రీష్మఋతువుకూ నియామకుడు.

## వైకుంఠ ఏకాదశి ప్రత్యేకం!
## కేశవాది రూపాలు!!


17


18

**ఓం పురుషోత్తమాయ నమః** (పద్మం-శంఖం-గద-చక్రం)

దేహనాశంగల సర్వజీవులూ క్షరపురుషులు. ఏవిధమైన నాశనమూ లేని అప్రాకృత శరీరంగల శ్రీమహాలక్ష్మీదేవి అక్షర పురుష. ఈ ఉభయ చేతనుల కంటే సర్వోత్తముడైనందువలన శ్రీహరి 'పురుషోత్తముడు' అనబడుతున్నాడు.

ఈయన గాయత్రిలోని 'ధి' అన్న అక్షరానికీ, రూపతత్త్వానికీ, కృష్ణ పక్షంలో ఉదరం కుడిభాగం మీద ధరించే నామానికీ, ఇంగువ, యాలకులు, ఆవాలు, కర్పూరాలకూ నియామకుడు.

**ఓం అధోక్షజాయ నమః** (గద-శంఖం-చక్రం-పద్మం)

ఇంద్రియనిగ్రహం కలిగిన వసుదేవాదులవల్ల ప్రాదుర్భవించినవాడూ, నిత్యజ్ఞానస్వరూపుడూ, అక్షయకుమారుడిని సంహ రించిన హనుమంతుడిచేత తెలియబడేవాడూ అయినందున శ్రీహరి 'అధోక్షజుడు' అనబడుతాడు. ఈయన గాయత్రిలోని "యో"అన్న అక్షరానికీ, రసతత్త్వానికీ, కృష్ణపక్షంలో కుడిస్తనం మీద ధరించే నామానికీ, పాలకూ, పానకమూ, మజ్జిగకూ, పచ్చిపులుసుకూ, నేతితో, నూనెతో వేయించిన పదార్థాలకూ నియామకుడు.


19


20

**ఓం నారసింహాయ నమః** (పద్మం-గద-శంఖం-చక్రం)

నరుడిలాగా, సింహంలాగా ఉభయాత్మకమైన శరీరం కలిగివున్నందు వల్ల శ్రీహరి 'నారసింహుడు' అనబడుతాడు.

ఈయన గాయత్రిలోని "యో" అన్న అక్షరానికీ, గంధతత్త్వానికీ, కృష్ణ పక్షంలో కుడిభుజం మీద ధరించే నామానికీ, బూడిద గుమ్మడికాయ, నువ్వులు, ఉద్దులుతో తయారుచేసిన వడియాలు మొదలైన పదార్థాలకూ, ఈశాన్య దిక్కుకూ నియామకుడు.

**ఓం అచ్యుతాయ నమః** (పద్మం-చక్రం-శంఖం-గద)

శుద్ధజ్ఞానానందాలే దేహంగా గలవాడూ, సకలగుణ పరిపూర్ణుడూ, సత్యసంకల్పుడూ అయినందువల్ల సర్వదా పూర్ణ కాముడూ, దోషరహితుడూ అయినందువల్లా శ్రీహరి 'అచ్యుతుడు' అనబడుతున్నాడు.

ఈయన గాయత్రిలోని "నః" అన్న అక్షరానికీ, ఆకాశతత్త్వానికీ, కృష్ణ పక్షంలో కంఠం కుడివైపున ధరించే నామానికీ, ఉద్దిపప్పుతో తయారుచేసే వడ మొదలైన వాటికీ నియామకుడు.

# కార్తికజ్యోతి

- బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ

ఒక్కొక్క మాసానికి ఒక్కొక్క ప్రత్యేకత. కాలమంతా పరమేశ్వరస్వరూపమే అయినా, ఒక్కొక్క కాల భాగంలో ఒక్కొక్క దివ్యత్వం గోచరిస్తుంది. జ్యోతిర్గణాల ప్రభావం ఆ యా కాలపరిమాణాలపై ఉంటుంది. అందుకే మన సంప్రదాయంలో ప్రతి ఋతువుకీ ప్రాధాన్యం, ప్రతి మాసానికీ వైశిష్ట్యం.

పురాణవాఙ్మయంలో పన్నెండు మాసాలకు ప్రత్యేక మహిమలు చెప్పే చిరుపురాణాలున్నాయి.

కార్తికపురాణం, మాఘపురాణం - వంటివి. వేదాలలో యజ్ఞాద్యనుష్ఠానాలుకూడా వివిధఋతువుల్లో వివిధ విధానాలను ఏర్పరచాయి. వాటిని సామాన్యజనులకు కూడా ఆచరణ యోగ్యంగా మలచడానికి పురాణాలు పూనుకున్నాయి. కార్తికం, మాఘం, శ్రావణం వంటి మాసాలలో ప్రత్యేకధార్మిక కార్యాలు విధించాయి.

**కార్తికమాసం అనగానే తెల్లవారుజామున స్నానాలు, ఉభయసంధ్యల్లో శివకేశవాదిఆలయాలలో దీపారాధనలు, నదులలో, తటాకాలలో దీపాలను విడిచి పెట్టడం. చక్కని సందడి!**

**ఇందులో దివ్యత్వంతో పాటు ఒక ఉత్సాహం, ఉల్లాసం వెల్లివిరుస్తాయి.**

చిరుచలిలో బద్ధకాన్ని వదల్చుకొని, చేసే స్నానం, చిరుదీపాలు నీటిఅలల్లో తేలియాడుతుంటే ఉండే సౌందర్యం.....

ప్రకృతిలో దివ్యత్వాన్ని ప్రతిష్ఠించి ప్రదర్శించే హైందవ మతంలోని దివ్యకళాచాతురిని కొనియాడవలసిందే!

కార్తికంలో దేశమంతా ప్రత్యేకంగా ఆధ్యాత్మిక చైతన్యంతో విలసిల్లుతుంది. ఎవరికి తగ్గ నియమాన్ని వారు పాటిస్తూ దైవాన్ని కొలుచుకుంటారు. కార్తికం దీపానికీ, మాఘం స్నానానికీ, వైశాఖం దానానికీ ప్రాధాన్యం.

కార్తికంలో వచ్చే చవితి, ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, సోమవారాలు ప్రత్యేకపర్వాలు. కొందరు మాసమంతా నక్త వ్రతం చేస్తారు. శివ, కేశవ, దేవీభక్తులకు ఇది ప్రత్యేకసాధనా మాసం.

ఈ మాసంలో విష్ణువును దామోదరనామంతో పూజిస్తారు. మార్గశీర్షంలో కేశవనామంతో మొదలుకొని, వరుసగా పన్నెండునామాలతో ప్రతిమాసపు శుద్ధఏకాదశినాడు విష్ణువును ఆరాధించడం సంప్రదాయం. ఆ వరుసలో కార్తికశుద్ధ ఏకాదశి దామోదరునిది. అందుకే ఈ మాసానికే దామోదర మాసం అని పేరు.

కార్తికంలో బృందావనవ్రతం విశిష్టమైంది. ఈ మాసంలో బృందావనానికి ప్రతీకగా తులసిని పూజించడం కార్తికంలో ప్రతిప్రాంతంలో జరుగుతుంది. తులసి, ధాత్రి (ఉసిరిక) సమేతంగా విష్ణువును పూజించడం ఈ మాసంలో ఆచారం. వృక్షాలలోని దివ్యత్వాన్ని దర్శించేసంస్కృతిలోని ఘనతకు నిదర్శనం.

మరొక ప్రత్యేకత వనభోజనం. ఇది సామాజిక సమైక్యతకు ఒక సంకేతం, నిజానికి దీనికికూడా ఒక సంప్రదాయపద్ధతి ఉంది. పవిత్రవృక్షాలున్న వనానికి చేరి తులసి, మారేడు, ఉసిరికవంటి వృక్షాల సన్నిధిలో దేవతారాధన చేసి, వండి నివేదించిన ఆహారపదార్థాలను భుజించడం ఆనవాయితీ.

ఇక కార్తికశుద్ధఏకాదశికి విశిష్టత ఉంది. దీనికి **'ఉత్థాన ఏకాదశి'** అని పేరు. ఈ రోజున ఏకాదశీవ్రతాన్ని చేసినవారికి విశిష్టఫలం చేకూరుతుందని శాస్త్రం. మార్గశీర్షంతో మొదలు పెట్టిన ఏకాదశీవ్రతానికి, ఈ కార్తికంతో సంవత్సర కాలం పూర్తవుతుంది.

అందుకే దీనికి ప్రాధాన్యం. దీని తర్వాత వచ్చే ద్వాదశికి ప్రాముఖ్యం ఉంది. దీనిని **'క్షీరాబ్ధిద్వాదశి'** అంటారు.

భాగవతంలో అంబరీషుని చరిత్ర ఉంది. అంబరీషుడు ఈ ఏకాదశీవ్రతాన్ని ఆచరించినవైనం చక్కగా వివరించారు. పైగా బృందావనంలోనే దీనిని ఆచరించినట్లుగా వర్ణించారు. అయితే అప్పటికి కృష్ణావతారం జరగకపోయినా, అనాదిగా అది విష్ణుధామమే! ధ్రువుడుకూడా తొలిమన్వంతరంలోని కృతయుగంలో పవిత్ర బృందావనంలోనే తపస్సు చేసినట్లుగా పురాణాలు చెబుతున్నాయి. ఈ అనాదివిష్ణుక్షేత్రంలోనే శ్రీకృష్ణుడు అవతరించి, తన నారాయణత్వాన్ని లీలలుగా ప్రకటించాడు.

**కార్తికపూర్ణిమ మరొకఅద్భుతం.**

**శరత్పూర్ణిమ ఆధ్యాత్మిక, యోగసాధనలకు విశేషమైంది. ధ్యానం, అర్చన మొదలైనవి ఈ రోజున అద్భుతఫలాలనిస్తాయి. ఈపూర్ణిమనాడు విశేషంగా దీపాలు వెలిగించడం ప్రత్యేకత. దీనిని 'దేవ దీపావళి' అంటారు.**



ఆశ్వయుజపూర్ణిమ, కార్తిక పూర్ణిమ – ఈ రెండూ శరత్పూర్ణిమలు. ఈ పూర్ణిమనాడే రాసలీలా మహోత్సవం జరిగింది.

యోగశుద్ధులైనజీవులు గోపికలు. వారిని పరమాత్ముడు అనుగ్రహించిన మోక్షప్రదానలీల రాసలీల. ఈ పూర్ణిమనాడు దేవీఆరాధనకూడా ముఖ్యమైంది. సహస్రార చంద్రకళాస్వరూపిణి అయిన శ్రీలలితామహాత్రిపుర సుందరిని ఈ పండుగనాడు ఆరాధించాలి.

కృత్తికానక్షత్రంనాడు పూర్ణిమ ఏర్పడే మాసం కార్తికం.

కృత్తిక అగ్నినక్షత్రం. అగ్నియందు ఈశ్వరస్వరూపాన్ని ఆవిష్కరించి ఆరాధించడమే యజ్ఞం.

అందుకే వేదాలలో 'నక్షత్రేష్టి' అనేది–కృత్తికానక్షత్రంతోనే ప్రారంభమవుతుంది.

ఆ యజ్ఞతత్త్వానికి సంకేతంగానే దీపారాధన' అనేది కార్తికంలో ప్రధానమయ్యింది. కార్తికంలో దీపార్చన, దీపదానంవంటివి–యజ్ఞఫలాలను ప్రసాదిస్తాయి,

కార్తికసోమవారంవంటివి శివప్రాధాన్యాన్ని చెబుతున్నాయి.

'కార్తికం' అనగానే మనకు శివుడే గుర్తువస్తాడు. శివ క్షేత్రాలలో గొప్పవైభవం కనిపిస్తుంది. కాశివంటి ఉత్తరాది శైవతీర్థాలుకూడా శివశోభను సంతరించుకుంటాయి.

కృత్తికానక్షత్రజాతుడూ, యజ్ఞాగ్నిస్వరూపుడూ అయిన సుబ్రహ్మణ్యుని ఆరాధనకుకూడా ఈ మాసం ప్రత్యేకం. 'కుమారదర్శనం' పేరుతో కార్తిక పూర్ణిమను వ్యవహరిస్తారు.

జ్యోతిర్లింగస్వరూపుడైన శివునికి ప్రతీకగా – ప్రతి దీపమూ ఒక జ్యోతిర్లింగమై భాసిస్తూ విశ్వవ్యాపకమైన ఈశ్వరజ్యోతిని దర్శించి, ఉపాసించమని ఉపదేశించేమాసమిది.



# కైంకర్యమే.. తనువు దాల్చితే....

20

- డా॥ కంపల్లె రవిచంద్రన్



**(మధురకవులు శ్రీనమ్మాళ్వార్లవారిని ఆచార్యులుగా స్వీకరించే ప్రయత్నంలో శ్రీనమ్మాళ్వార్లవారి వైభవాన్ని కనులారా చూస్తున్నారు)**

ఆ ప్రశ్నకు సమాధానం - ఇదిగో నమ్మాళ్వార్లగొంతు నుండి వచ్చే ఆ అమృతధారను పోలినపాశురాన్ని గమనించండి.

**మేగంగళో ఉరైయిర్; తిరుమాల్ తిరుమేని ఒక్కుం**
**యోగంగళ్ ఉంగళుక్కు ఎవ్వారుపెర్తీర్? ఉయిర్ అళిప్పాన్**
**మాగంగళెల్లామ్ తిరిందు, నన్నీర్గళ్ శుమందు, నుంతం**
**ఆగంగళ్ నోప వఱుత్తం తవమాం అరుళ్ పెట్రదే!**

తీగలు-చెట్లు-పక్షులు-మృగాలు- మనుష్యులు ఇవీ, అవీ అనేభేదం లేకుండా అన్నీ ఉజ్జీవించాలని శరీరశ్రమను కూడా లెక్క చేయకుండా-మంచినీటిని మోసుకొని- ఆకాశ మంతా తిరుగుతున్నాయి- మేఘాలు. జీవరాసులకు ఉపకారం చేయటంకంటే మేలైన తపస్సుందా? ఈ విధంగా నీటిని మోసు కొని దేశమంతా తిరిగి వర్షించి - జీవరాసులకు ఉపకారం చేసి-ఆ ఉపకారం చేయడంవల్ల భగవంతునిదయకు పాత్రులవు తున్నారు- అనుకొంటూ తృప్తిని పొందుతున్నారు- నమ్మాళ్వార్లు.

అంతేకాదు మెరుపులతో కలిసిన మేఘాలు - ఉరుము లతో కలిసిన మేఘాలు వీటినన్నింటినీకూడా వర్ణిస్తున్నారు. ఎలాంటికల్పనలో చూడండి - నమ్మాళ్వార్లు కల్పనలు!

ఆకాశం నీలమేఘశ్యాముణ్ణి జ్ఞాపకం చేస్తోంది, మెరు పులు దయాస్వరూపిణియైన మహాలక్ష్మిని జ్ఞాపకం చేస్తున్నాయి. మేఘాలు భక్తుల్ని జ్ఞాపకం చేస్తున్నాయి. ఇవన్నీ కలిసి ఆ లక్ష్మీ నారాయణుణ్ణి జ్ఞాపకం చేస్తున్నాయి. మంచినీటిని మోసుకొని, ఆకాశమంతా తిరిగే మేఘాలవల్లే, మంచి నడవడికలు కలిగి, ప్రేమను, దయను మోసుకొని, ఈ భూమినంతా తిరుగుతారు- భక్తులు. తిరగడమే కాదు శరీరశ్రమనుకూడా లెక్క చేయకుండా ప్రాణులకు సన్మార్గసదుపదేశాలు చేస్తూ - వారికి కైంకర్యం చేస్తూ-ప్రేమను, దయను ఈ ప్రపంచంపై వెదచల్లుతూ తిరుగు తారు. ఇంకా- పాపాత్ములు పరితపించి పశ్చాత్తాపాన్ని పొంది, మంచిమార్గాన్ని అనుసరించేటట్లు చేస్తారు. నమ్మాళ్వార్లే చెబు తున్నారు- వినండి. "అవును భక్తి-పరోపకారం- అనేవి రెండే భక్తులకు తపస్సు" అంటున్నారు. నమ్మాళ్వార్లు ఈ విధమైన భక్తబృందాలకు "తలమానికం" అని శ్రీవైష్ణవుల నమ్మిక.

నమ్మాళ్వార్లు తాము పొందిన మహోన్నతస్థానాన్ని స్వల్పకాలంలో పొందలేదని వీరివాక్యాలవల్లే తెలుస్తోంది. ఇదిగో నమ్మాళ్వార్లవాక్యాలు "నేనేమో అనుదినం ప్రార్థన చేస్తున్నాను- ఆ భగవంతుడేమో దర్శనం ఇవ్వలేదు - దర్శనమే కాదు - దయా చూపలేదు-ఓ మనసా! ఆ భగవంతునిదయా ప్రవాహం- ఎక్కి ప్రవహించలేని అంత ఎత్తైన ప్రదేశంలో ఉండే స్థలం?"- అని దుఃఖపడుతున్నారు - ఒక సమయంలో. అంతటితో ఆగక "ఎక్కడ చూచేది? ఈ ప్రపంచాన్నంతటినీ సృష్టించిన మొదటి విత్తనమైన ఆ భగవంతుణ్ణి?" అని దిక్కులన్నీ చూస్తున్నారు. "గొంతెత్తి అరచి అరచి పిలుస్తున్నానే - అయినా చూడడానికి సాధ్యం కాలేదే - నా అరుపుల్లో ఒక అరుపైనా అతనికి విని పించలేదా? లేక అతడు బదులు పలికేమాట నాకు వినిపించడం లేదా?" అంటూ నిట్టూర్పు వదులుతున్నారు - ఇంకొక సమయంలో.

ప్రకృతికి అతీతమైన ఆ పరతత్త్వాన్ని తెలుసుకొనే వీలు కాలేదని నిర్ణయించుకొన్నారు - నమ్మాళ్వార్లు. అయినా తన



వందలో ఒకరిగా ఉండడానికి ప్రయత్నించాలి

పట్టుదలను వదల్లేక అవతారమూర్తుల్ని పూజిస్తూ ప్రార్థిస్తున్నారు. అన్ని వస్తువుల్లోనూ అంతర్యామిగా ప్రకాశిస్తున్న ఆ జ్ఞానాన్ని – ఆ ప్రేమను–ఆ దయను తెలుసుకొని నమస్కరిస్తున్నారు. స్వయం వ్యక్తమైన దేవాలయాలలో – అంతర్యామియైన వస్తువుకు జ్ఞాపక చిహ్నాలైన విగ్రహాల్ని పూజించి, దయను పెంచుకొంటున్నారు. ఆ విగ్రహాలను దర్శించి –

అన్దామ త్తన్బుశెయ్దు ఎన్ఆవిశేర్ అమ్మానుక్కు
అన్దామవాళ్ ముడిశఙ్గాళ్నూల్ ఆరముళ
శెన్దామరై త్తడశఙ్గణ్ శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్
శెన్దామరై యడిక్కళ్ శెమ్బున్ తిరువుడమ్బే.

ముడిచ్చోదియామ్ ఉనదు ముగచ్చోది మలర్న్దదువో
అడిచ్చోది నీనిన్ఱ తామరైయామ్ అలర్న్దదువో
పడిచ్చోది యాడై యొడుమ్ పల్ కలనామ్ నిన్ పై మ్బొన్
కడిచ్చోది కలన్దదువో తిరుమాలే కట్టురైయే.

"అందమైనపరమపదవాసులపై గల ప్రీతి నాపై ఉంచి, నా మనస్సును చేరినస్వామి అందమైన తులసీమాల, కిరీటం, పాంచజన్యం, సుదర్శనం, యజ్ఞోపవీతం, హారాలతో కూడి ప్రకాశిస్తున్నాడు. అతనివిశాలమైన కన్నులు ఎఱ్ఱతామరలవలే ఉన్నాయి. తామరలవలే నోరు, అధరాలు ఎఱ్ఱగా ఉన్నాయి. శ్రీపాదాలు తామరవలే ఉన్నాయి. ఆ దివ్యమంగళవిగ్రహం పచ్చనిపదారువన్నె బంగారువలే ప్రకాశిస్తోంది.

ఓ శ్రియఃపతీ! నీ ముఖకాంతి ముఖంతో నిలువక పైకెగసి, కిరీటమనే కాంతిరూపంగా ప్రకాశిస్తున్నదా? నీ శ్రీపాదాల కాంతిపుంజం నీవు వేంచేసి ఉన్న పవిత్రపద్మపీఠమై ప్రకాశిస్తున్నదా? నీ అందమైన నడుముకాంతి స్వభావసిద్ధమైన కాంతి గల పీతాంబరంతో కూడి, అనేకవిధాలైన ఆభరణాలై ప్రకాశిస్తున్నదా? ఓ భగవంతుడా! నీవే ఆనతీవయ్యా!" అని, ఇలా తమ ఇష్టదైవాన్ని విశేషమైన మనోభావంతో ధ్యానించి, అందాన్ని చూచి, తనను సేవకునిగా చేసుకొన్న ఆ ప్రేమికునికి తనప్రేమ కిరీటం మొదలైన ఆభరణాలుగాను, తనమనస్సు శరీరానికి పూసే దివ్యచందనంగానూ కల్పించుకొంటున్నారు– నమ్మాళ్వార్లు.

నమ్మాళ్వారుమొర విని, ఆ భగవంతుడు "అజ్ఞాన తిమిరం– పాపతిమిరం" నశించేటట్లు జ్యోతిగా కన్పించి, తన స్వరూపాన్ని చూపిందే – "పరమసుందరా! పద్మాక్షా! సాటిలేని కాటుకవలే నల్లనైనశరీరం కలవాడా! భూత భవిష్య ద్వర్తమాన కాలాల నిర్వాహకుడా! నిన్ను ఏ రోజు తెలుసు కొనేది?" – అని తాపత్రయపడుతూ ఉన్న నా హృదయం–

'సకలశాస్త్రాలవలే ఉన్నవాడు–షణ్మతాలరూపంలో ఉన్న వాడు– సుస్థిరంగా ఉన్నవాడు– సమస్తవస్తువులకు అంతరాత్మ అయినవాడు– దేవతల కందరికీ కారణభూతమైనవాడు– అన్నింటికీ ఆదియైనవాడు ఐన నా స్వామిని– కృష్ణుణ్ణి దర్శిం చాను" అని పరమానందాన్ని పొందిందంటున్నారు – నమ్మాళ్వార్లు.

అన్నింటినీ పరిత్యజించి, మహానుభావుడు నమ్మాళ్వార్లు పొందిన ఆ మహోన్నతస్థానం ఆయనకు సులభంగా కడపట దొరికిందని తోస్తూంది – మనకు. ఆ అయోమయస్థితిలో నమ్మాళ్వార్లు ఎన్నోమెట్లు దాటిపోతున్నారు. సూక్ష్మ–అతిసూక్ష్మ– సూక్ష్మాతి సూక్ష్మఅనుభవాలకు అంతే లేదని తోస్తూంది– నమ్మాళ్వార్ల పాశురాలు చదివి చదివి ఆనందించినప్పుడు!!

*(ఇంకా ఉంది)*

## వైకుంఠపాళి

### :: 25 – సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 కు | 2 మా | ర | 3 సం | భ | 4 వ | ము | |
| 5 అ | | రి | | ధ్యా | | ధ | | 6 సౌ |
| 7 ని | శ | | 8 సా | వా | సం | | 9 న | గ |
| లి | | 10 గా | | టి | | 11 న | | సు |
| | 12 సా | య | కం | | 13 నా | గా | రి | |
| 14 మ | | త్రి | | 15 మొ | | రి | | 16 గ |
| 17 యూ | ధం | | 18 గం | గ | మ్మ | | 19 పౌ | గ |
| ఖం | | 20 కం | | సా | | 21 యో | | నం |
| | 22 శి | శు | పా | ల | వ | ధ | ము | |

# భూలోక వైకుంఠం....
# శ్రీరంగపట్నం

- శ్రీ డి.వి.ఆర్.భాస్కర్




శ్రీవైష్ణవులు పరమపవిత్రంగా భావించే 108 శ్రీవైష్ణవ దివ్యదేశాలలో కర్ణాటకరాష్ట్రంలోని శ్రీరంగపట్టణం ఒకటి. అంతే కాదు, కావేటితీరంలో అత్యంతప్రసిద్ధి చెందిన శ్రీరంగనాథుని ఆలయాలలో శ్రీరంగపట్నం రంగనాథస్వామి ఆలయం ఒకటి. స్వామివారి పేరు మీదుగానే ఈ ఊరికి శ్రీరంగపట్టణమనే పేరు వచ్చింది. తొమ్మిదవశతాబ్దంలో గంగవంశపురాజులు నిర్మించిన ఈ ఆలయాన్ని అనంతరకాలంలో హోయసాల రాజులు పునర్నిర్మించారు. గొప్ప నిర్మాణచాతుర్యం, మనో హరమైన శిల్ప కళారీతులు ఈ ఆలయప్రత్యేకత. భూలోక వైకుంఠంగా ఈ ఆలయం ప్రసిద్ధికెక్కింది.

కర్ణాటక రాష్ట్రంలోని మైసూరుకు అతిసమీపంలో మాండ్యాజిల్లాలో ఉన్న ఈ ఆలయానికి చారిత్రకంగా, ధార్మికంగా, సాంస్కృతికంగాకూడా ఎంతో పేరుంది.

మైసూరు రాజులు శ్రీరంగపట్టణాన్నే రాజధానిగా చేసుకుని పరిపాలన చేశారు. రంగరాయను ఓడించి వడయార్ రాజు 1614లో శ్రీరంగపట్టణాన్ని వశపరచుకున్నాడు. విజయ నగర సామ్రాజ్యంపై దండెత్తిన వడయార్ రాజుకు విజయనగర సామ్రాజ్యఆరాధ్యదేవత అలమేలమ్మశాపం తగలడంవల్ల, వడయార్ రాజుకు సంతానం కలగలేదని స్థానిక కథనం. హైదర్ అలీ, టిప్పుసుల్తాన్ హయాంలో శ్రీరంగపట్టణమేవారి రాజధాని. మైసూర్‌పులి టిప్పు సుల్తాన్‌కి శ్రీరంగనాథుడంటే ఎనలేని భక్తి, టిప్పు సుల్తాన్‌తండ్రి హైదరాలీ మైసూరును పాలించిన కాలంలో ఈ ఆలయానికి సమీపంలోని మందు గుండు సామగ్రి కార్ఖానా పేలి, రంగనాథస్వామి ఆలయగోపురం విరిగిపడినప్పుడు హైదర్ అలీ తన సైనికులను పంపి, వారిచేత వెంటనే ఆలయగోపు రాన్ని నిర్మింపజేశాడట. అసలు ఆయన ఏ యుద్ధం చేయాలన్నా రంగనాథుణ్ణి ప్రార్థించిన తర్వాతనే యుద్ధ భూమిలోకి అడుగు పెట్టేవాడట! హైదరాలీకి రంగనాథుడి అనుగ్రహం ఉండబట్టే తాను విజయం సాధిస్తు న్నాననే విశ్వాసంతో రంగనాథుడికి ప్రతిసంవత్సరం ధను ర్మాసంలో ఎన్నో ఉత్సవాలు నిర్వహించేవా డని ప్రతీతి.

శ్రీరంగపట్టణంచుట్టూ కావేరీనది ఆవరించి ఉంటుంది. అందువల్ల ఇది ఒక ద్వీపంలా కనిపిస్తుంది. ఎత్తైన ఆలయ గోపురం దూరప్రాంతాలకుకూడా కనిపిస్తుంటుంది. రెండు సువిశాలమైన ప్రాకారాలు, ఆలయమంటపం, ఉన్నతమైన ముఖ మంటపంతో అలరారుతుంటుంది. ఆలయముఖద్వారం పైకప్ప చిన్నచిన్నశిఖరాలన్నీ కలసి గుచ్చిన పుష్పమాలాలంకృతమై ఉంటుంది.

గర్భగుడిలోకి అడుగుపెట్టగానే ఏడుతలల ఆది శేషువునిపై శయనించి ఉన్న శ్రీమహావిష్ణువు, ఆయనపాదాలు వత్తుతున్నలక్ష్మీదేవి దర్శనమిస్తారు. ఆలయంలో నరసింహ స్వామి, గోపాలకృష్ణుడు, శ్రీనివాసుడు, హనుమంతుడు, గరుడుడు, పన్నిద్దరు ఆళ్వారుల సన్నిధులుకూడా కనిపిస్తాయి. కావేరీనీరు వైకుంఠంలోని విరజానదితో సరితూగగలిగేంత పవిత్రమైనదని విశ్వాసం. గంగకూడా కావేరీలో స్నానంచేసి తన పాపాలను పోగొట్టుకుంటుందని పురాణకథనాలున్నాయి. అంతేకాదు, కావేరీనదికోరికమేరకే శ్రీరంగనాథుడు ఇక్కడ



కొలువయ్యాడనీ, బ్రహ్మ, రుద్రుడుకూడా దివినుంచి భువికి దిగివచ్చి రంగనాథుణ్ణి పూజిస్తా రని ప్రతీతి.

11వ శతాబ్దంలో భగవద్రామానుజులవారు చోళదేశం నుంచి ఇక్కడికి విచ్చేసి, అప్పటి పాలకుడిగా ఉన్న హొయసల బిత్తిదేవుడికి శ్రీవైష్ణవతీర్థమిచ్చి, ఆయనను వైష్ణవుడిగా మార్చి, విష్ణువర్ధనుడనే వైష్ణవనామమిచ్చారు.

ఆయన ఎంతో ధనాన్ని వెచ్చించి, ఆలయఅభివృద్ధికి పాటుపడ్డాడు. ఆయనభార్య అలమేలమ్మకూడా స్వామివారికి భక్తురాలుకావడంతో ప్రతి మంగళ, శుక్రవారాలలో దేవేరులకు అమూల్యమైన ఆభరణాలు తయారు చేయించి అలంకరింప జేసేది.

ఆ తర్వాత వచ్చిన విజయనగరరాజులుకూడా ఆలయాన్ని ఇతోధికంగా అభివృద్ధి చేశారు. అనంతరకాలంలో మైసూరు మహారాజులుకూడా ఆలయానికి మరింత శోభను చేకూర్చారు. అంగరంగవైభవంగా ఉత్సవాలు నిర్వహించారు.

## సేవలు, ఉత్సవాలు

మకరసంక్రాంతినాడు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ముక్కోటిఏకాదశినాడు భక్తులకు స్వామివారిఉత్తరద్వారదర్శన భాగ్యం కల్పిస్తారు. ఈరోజున స్వామివారిని వెన్నతో అలంకరి



స్తారు. సాయంకాలం కిరీటాలంకరణ చేస్తారు. ఆ తర్వాత రథసప్తమికికూడా బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు.

మాఘపూర్ణిమనాడు స్వామివారికి కావేరీనదిలో పుణ్యస్నానం చేయిస్తారు. ఈ పర్వదినాన వేలాదిభక్తులు వచ్చి, స్వామిని సేవించుకుంటారు. వైశాఖశుద్ధసప్తమినాడు శ్రీరంగజయంతి ఉత్సవాలు జరుపుతారు. ఆ తర్వాత వచ్చే పున్నమినాడు బంగారుగరుడవాహనంపై స్వామివారిని ఊరే గిస్తారు. ఆశ్వయుజమాసంలో నవరాత్రి ఉత్సవాలు నిర్వ హిస్తారు.

## ఎలా వెళ్లాలి?

దేశంలోని అన్నిప్రధాననగరాలనుంచీ శ్రీరంగపట్నా నికి నేరుగా రైళ్లు, బస్సులు ఉన్నాయి. విమానాశ్రయం మాత్రం మైసూరులో ఉంది. అక్కడినుంచి శ్రీరంగపట్నం కేవలం పదహారు కిలోమీటర్లే. విశాఖపట్నంలోని గాజువాక నుంచి శ్రీరంగపట్నానికి నేరుగా రైలుంది. 










ధనుర్మాసం తెలుగుసంస్కృతిలో ఒక భాగం. దివ్య ప్రార్థనకు అనువైన మాసం. దేవాలయాల్లో జరిగే ఆగమవిహిత కైంకర్యాలలో స్థానికఆచారవ్యవహారాలు, ఇతరసంప్రదాయాలు కలగలసిన అంశాలలో ధనుర్మాసం ఒకటి. తిరుమలలో ధనుర్మాసం నెలరోజులు, సుప్రభాతం బదులు తిరుప్పావై గానం చేస్తారు. సహస్రనామార్చనలో తులసీదళాలకు బదులు బిల్వపత్రాలు ఉపయోగిస్తారు. శయనబేరంగా ఈ ధనుర్మాసంలో రజత శ్రీకృష్ణస్వామిని అర్చిస్తారు. ఇది తిరుమలలో జరిగే సంప్రదాయం. విష్ణుఆలయాలలో ఉదయం పూట అర్చనలు చేసి నివేదనలు చేసి, వాటిని పిల్లలకు పంచుతారు. దీన్ని బాలభోగం అని పిలుస్తారు.

ఈ ధనుర్మాసంలో ఉభయసంధ్యలలో ఇల్లు శుభ్రం చేసి, దీపారాధన చేయటంవల్ల మహాలక్ష్మిఅనుగ్రహం లభిస్తుంది. దరిద్రం దూరం అవుతుంది. ఈ మాసంలో ప్రతిరోజూ బ్రాహ్మముహూర్తంలో పారాయణం చేసినవారు దైవానుగ్రహానికి పాత్రులవటం తథ్యమని శాస్త్రవచనం. సాక్షాత్తూ భూదేవి అవతారమూర్తి అయిన అండాళ్ రచించిన దివ్యప్రబంధమే తిరుప్పావై, ద్రావిడభాషలో 'తిరు' అనగా పవిత్రమైన, పావై అనగా వ్రతం, వ్రతప్రబంధం అని అర్థం. వేదాలు, ఉపనిషత్తులసారమే తిరుప్పావై అని మనపూర్వాచార్యులు ప్రస్తుతించారు. ఉపనిషత్తులే గోదాదేవినోట సర్వసులభరీతిలో వెలువడినాయనీ, తిరుప్పావై మహావిష్ణుపాదపద్మాలను అందుకోవటానికి మార్గదర్శకం అనీ చెప్పబడింది. ఈ మాసంలో విష్ణువును మధుసూదనుడు అనేపేరుతో పూజించి, మొదటి పదిహేనురోజులు చక్కెర పొంగలి లేదా పులగం నైవేద్యంగా సమర్పించాలి. తర్వాత పదిహేనురోజులు దధ్యోదనం అర్పించాలి. పెళ్లీడు అమ్మాయిలు తమ ఇళ్లముందుముగ్గులు, గొబ్బిళ్లతో పూజలు చేయటంవల్ల కోరినవరుడు లభిస్తాడు. గోదాదేవి మార్గళివ్రతం పేరుతో విష్ణువును ధనుర్మాసమంతా పూజించింది. ప్రతిరోజూ ఒక పాశురంతో (కీర్తన) స్వామిని కీర్తించేది.



ఈ వ్రతంవల్ల మోక్షం సిద్ధిస్తుంది. శ్రీకృష్ణునికి ధనుర్మాసం నెలరోజులూ తులసీమాల సమర్పించే యువతులకు, నచ్చినవరునితో వివాహం జరుగుతుంది. ధనుర్మాసవ్రతం గురించి మొదట బ్రహ్మదేవుడు నారదమహర్షికి వివరించి నట్లు పురాణకథనం. ధనుర్మాసవ్రతానికి సంబంధించిన అంశాలు బ్రహ్మాండ, ఆదిత్యపురాణాల్లో, భాగవతంలో, నారాయణ సంహితలో కనిపిస్తాయి. ఈ వ్రతం ఆచరించుకోవాలనుకునే వారు శక్తిమేరకు విష్ణుప్రతిమను తయారుచేయించి, పూజా గృహంలో ప్రతిష్ఠించుకోవాలి. ప్రతిరోజూ సూర్యోదయానికి ముందులేచి, స్నానాదికాలు ముగించాలి. పంచామృతాలతో శ్రీమహావిష్ణువును అభిషేకించాలి. అభిషేకానికి శంఖం ఉపయోగించడం మంచిది. తర్వాత తులసీదళాలు, పూలతో అష్టోత్తర సహస్రనామాలతో స్వామిని పూజించి, నైవేద్యం సమర్పించాలి. ఈ నెలరోజులూ విష్ణుకథలను చదవటం, తిరుప్పావై పఠించటం



## తిరుప్పావై అంటే ఏమిటి?

తిరుప్పావై ఒక అద్భుతవేదాంతగ్రంథం. భగవంతుణ్ణి సులభంగా అందించగలిగే సాధనమార్గం. 'తిరు' అంటే శ్రీ అని, 'పావై' అంటే పాటలు లేక వ్రతం అని అర్థం. కలి యుగంలో మానవకన్యగా జన్మించి, గోదాదేవిగా ప్రఖ్యాతయైన ఆండాళ్ భగవంతుడినే తనభర్తగా భావించి, ఆయన్ను చేపట్ట డానికి సంకల్పించినవ్రతమే తిరుప్పావైవ్రతం.

తిరుప్పావైలో పాశురాలు ఉంటాయి. పాశురం అంటే ఛందోబద్ధంగా ఉన్న పాటలు. ఆండాళ్ అపురూపభక్తిపారవ శ్యాన్నే శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద అనే గ్రంథంగా అందించారు.

తిరుప్పావై వ్రతానికి కొన్నివిధివిధానాలు ఉన్నాయి. వేకువజామునే నిద్రలేచి స్నానంచేయాలి. ప్రతిరోజూ క్రమం తప్పకుండా స్వామి కీర్తనలను, తిరుప్పావై పాశురాలను ఆలపించాలి. చెయ్యాలి. నెలరోజులూ చెయ్యలేనివారు పదిహేనురోజులు, ఎనిమిది రోజులు లేదా కనీసం ఒక్కరోజైనా ఆచరించవచ్చు.

ధనుర్మాసవ్రతం చేయడంవల్ల ఇహలోకసుఖాలు, పర లోకమోక్షం పొందుతారు. ఆత్మ పరమాత్మను చేరడానికి ఉప కరించేదే ధనుర్మాసవ్రతం. ప్రాచీనకాలంనుంచి భారతీయు లందరూ ఈ వ్రతాన్ని ఆచరిస్తున్నారు.

భక్తిమార్గంతో భగవంతుణ్ణి సులభంగా వశపరచు కోవచ్చని నిరూపించిన ఆరాధనా తపస్విని గోదాదేవి తనపాశు రాలలో–చివరిపాశురంలో సూచించిన విధంగా– ఈ తిరు ప్పావై పారాయణ చేసినవారికి, తిరుప్పావైగానం, శ్రవణం చేసినవారికీ దీర్ఘాయువు, ఆరోగ్యం, సకలఐశ్వర్యాలూ, ముక్తీసిద్ధిస్తా యని ఆశిద్దాం!

## ధనుర్మాసంలో నైవేద్యం... ప్రత్యేకతలేంటి ?

ఈ మాసంలో వేకువనే చేసే పూజలో ప్రసాదంగా పులగం, పాయసం, దధ్యోదనం సమర్పిస్తారు. చలికాలంలో కడుపులో జఠరాగ్నిపెరిగి, తద్ద్వారా ఆకలి పెరుగుతుంది. ఈ జఠరాగ్ని సాత్త్వికాహారం తీసుకోవడంవల్ల చల్లబడుతుంది. పాలు, పెరుగు, పెసరపప్పులతో చలువ చేసేగుణం ఉన్నందు వల్ల ప్రసాదంగా వాటిని వినియోగించటం జరుగుతుంది.

ఆయుర్వేదం, జ్యోతిష్యం ప్రకారం–ఈ ఆహారం తీసుకోవడం వల్ల సత్త్వగుణం అలవడి సత్ఫలితాలు కలుగు తాయి.






పేదలకు దానాలు, పండితులకు సన్మానాలు చేయాలి. స్వామికి, ఆండాళ్‌కు ఇష్టమైన పుష్పకైంకర్యం చేయాలి. ప్రతిరోజూ స్వామి వారికి పొంగలి నివేదించాలి.

సృష్టిలో భగవంతుడు ఒక్కడే పురుషుడు, మానవు లందరూ స్త్రీలు అనే ఉద్దేశంతోనే విష్ణుమూర్తిని శ్రీవారు అని సంబోధిస్తుంటారు. అటువంటి విష్ణుమూర్తిని భర్తగా పొందాలనే తలపుతో గోదాదేవి ధనుర్మాసంలో చేసిన ఈ వ్రతాన్ని నేటికీ మనం ఆచరిస్తున్నాం. ధనుర్మాసం మొదటిరోజున ఈ వ్రతాన్ని ఆరంభించి, భోగిరోజున ఆండాళ్, శ్రీరంగనాథులకల్యాణం జరిపించడంతో ఈ వ్రతం ముగుస్తుంది.

శ్రీవైష్ణవసంప్రదాయం ప్రకారం భక్తిసాగరంలో మునిగి తేలినవారిని "ఆళ్వారులు' అంటారు. పన్నెండుమంది ఆళ్వారుల్లో విష్ణుచిత్తుడు మొదటివాడు. ఆయన గోదాదేవికి భక్తిసంపదల్ని వారసత్వంగా ఇచ్చారు. నిజానికి భూదేవియే ఆండాళ్ అని చెప్తారు. జనకమహారాజు భూమిని దున్నేసమయంలో సీతామాత దొరికింది. అలాగే శ్రీరంగనాథునికి పుష్పకైంకర్యంకోసం విష్ణు చిత్తులవారు తులసితోట సాగుచేస్తుండగా ఆండాళ్ దొరికింది.

భగవంతుణ్ణి తప్ప ఇతరులను సేవించడానికి విని యోగం కాని తులసివనంలో ఆండాళ్ దొరకడాన్ని గమనిస్తే సీతాదేవి, ఆండాళ్– భూదేవి అంశయే అనే సంగతి అర్థమౌ తుంది. ఆండాళ్ అసలు పేరు కోదై. కోదై అంటే మాలిక. ఆ పేరే క్రమంగా గోదాగా మారింది.

ఆ గోదాదేవి రచించిన 30 పాశురాలలో ఏయే అంశాలు ఉన్నాయో తెలుసుకోవాలనే ఆసక్తి అందరికీ ఉంటుంది. 30 పాశురాలలోని అంశాలు స్థూలంగా మంచిని ప్రబోధిస్తాయి. మంచి అలవాట్లతో జీవించ మనీ, తోటివారికి సాయపడమనీ, భగవంతుణ్ణి తప్పనిసరిగా ఆరాధించమనీ ఈ ప్రబోధాలు సూచిస్తాయి.

## కన్నెపిల్లలకు మేలు చేసే వ్రతం

వివాహం వంటి, మంచి కోరికలు కలిగినవారు తిరుప్పావై పారాయణం చేయడంవల్ల అవి ఫలిస్తాయని భావి స్తారు.

విష్ణుచిత్తుడి కుమార్తె అయిన గోదాదేవి మానవ మాత్రుల్ని కాక – రంగనాథుణ్ణే వివాహం చేసుకుంటానని దీక్ష పూనుతుంది.

ఆ కారణంగా ఆమె ధనుర్మాసంలో వేకువనే లేచి, నిత్యం విష్ణు పూజ చేస్తూ తనకు కలిగిన అనుభవాన్నీ, భావాన్నీ ఒక పద్యం అనగా పాశురం రూపంలో రచించేది.

అలా 30 పాశురాలను ఆ మాసంలో రచించి, వాటిల్ని విష్ణువుకు అంకితం చేసింది.

వెంటనే విష్ణువు ప్రత్యక్షమై ఆమెను శ్రీరంగం రమ్మని చెప్పగా ఆమెకోరికపై ఆమెతండ్రి గోదాదేవిని తీసుకొని, శ్రీరంగంచేరి, రంగనాథస్వామితో వివాహం జరిపిస్తాడు.

వివాహం జరిగినంతనే గోదాదేవి రంగానాథుని పాదాల చెంత మోకరిల్లి స్వామిలో లీనం అయిపోతుంది.



## గొబ్బెమ్మలు ఎందుకు ... పెడతారు?

ఇంటిముందు ముగ్గులు వేసి గొబ్బెమ్మలు పెట్టి, వాటిని బియ్యం పిండి, పసుపు, కుంకుమ, పూలతో అలంకరించి, పూజిస్తారు. నిత్యం ముగ్గులు వేయడం వల్ల మహిళలకు మంచి వ్యాయామం కలుగుతుంది.





## కాత్యాయనీ వ్రతం.... పూజావిధానం

రోజులాగే ముందు పూజ చేసుకోవాలి.... ఆ తరువాత శ్రీకృష్ణఅష్టోత్తరశతనామావళి, గోదా అష్టోత్తర శతనామావళి, చదవుకోవాలి. రంగనాథఅష్టోత్తరశతనామా వళి కూడా చదివితే మరీ మంచిది..... ముందుగా ప్రార్థన చదవాలి.... ఆ తరువాత వరుసగా తనియను చదవాలి.... తిరుప్పళ్ళి యెళుచ్చి చదివేటప్పుడు ప్రారంభం కదిరవన్ చదవకుండా అది మొత్తం ఒక్కసారి చదివాక రెండవసారి చదివినప్పుడు కదిరవంతో కలిపి చదవాలి. తనియను చదువుతూ తొమ్మిది, పదితనియనులు రెండుసార్లు చదవాలి. చివర తిరుప్పళ్ళి యెళుచ్చి సంపూర్ణం అని చదవాలి.

ఆ తరువాత ప్రార్థన చదవాలి. ఆ తరువాత గోదాదేవి తనియను చదవాలి. ఆ తరువాత పాశురాలు చదవడం ప్రారంభించాలి. పాశురాలు చదివేటప్పుడు మొదటి పాశురం రెండుసార్లు చదవాలి. అలా మొత్తం అన్నిపాశురాలు రోజూ చదవాలి. అలా వీలు కాని వారు మున్నిడి పిన్నిడిగా చదవాలి. (అంటే – మొదటి పాశురంలో ఒక లైను, చివర పాశురంలో ఒక లైను చదవాలి...)

చివరగా గోదాహారతి చదవాలి..... మంత్రపుష్పం కూడా చదవాలి... మళ్ళీ ఏ రోజు పాశురం ఆ రోజు రెండు సార్లు చదివి హారతి ఇవ్వాలి.... నైవేద్యం సమర్పించాలి. రోజూ పొంగలి, దధ్యోదనం, పరమాన్నం ఉండి తీరాలి..... సమయం ఉంటే గోదాదేవిపాటలుకూడా పాడుకోవచ్చు.... కానీ ఒక్క విషయం– ఇవన్నీ సూర్యోదయానికి ముందే మొదలవాలి.










# ఆదర్శదంపతులు

– శ్రీ ఉమ్మడి రవింద్రారెడ్డి

పూర్వం ప్రయాగలో ఒక వర్తకుడు ఉండేవాడు. ఆయన సంపన్నుడేగాక సజ్జనుడుకూడా. ఆయనభార్య అన్నివిధాలా భర్తవంటిదే. ఆ భార్యాభర్తలు ఆదర్శదంపతులుగా ఉండేవారు. వారిజీవితాలకు ఒకటే కళంకం. అదేమిటంటే, వారి కుమారుడు శశికేతుడనేవాడు.

శశికేతుడు పరమపాపిష్ఠివాడు. పసితనంనుంచీ చెడు సావాసాలు చేసి, చెడుదారి పట్టాడు. తండ్రి ఎంత మందలించినా, తల్లి ఎంత బ్రతిమాలినా వాడిపద్ధతి కొంచెం కూడా మారలేదు. వాడిమూలాన వాడితల్లిదండ్రులు నలుగురిలోనూ తల ఎత్తుకు తిరగటానికికూడా వీలులేకుండాపోయింది.

వర్తకుడికి ఊరిపూజారి ఆప్తమిత్రుడు. అందుచేత వర్తకుడు తనకొడుకు విషయం పూజారితో చెప్పకున్నాడు.

"మా శశిదుర్మార్గం నాటినాటికీ హెచ్చిపోతూందిగానీ కొంచెంకూడా తగ్గేటట్టు లేదు. ఏళ్లు పైన పడితే వాడే సరి అయిన మార్గం లోకి వస్తాడని ఆశపడ్డానుగానీ, ఆ ఆశ కాస్తా దూరమైపోయింది. ఏంచేస్తే వాడు బాగుపడతాడో మీరైనా చెప్పండి. నా భార్య వాడిమూలంగానే మనోవ్యాధితో క్రుంగిపోతూంది. వాడు బాగుపడకపోతే అది జీవించదు!" అన్నాడు వర్తకుడు.

"నిజం చెప్పాలంటే, మీ ఇద్దరి మంచితనమే వాణ్ణి ఇంతకు తెచ్చింది. మీ ప్రాపు చూచుకునే వాడు అచ్చుపోసిన ఆబోతులాగా తిరుగుతున్నాడు. నా మాట విని, వాణ్ణి దూరదేశం పంపెయ్యండి. అక్కడ వాడికి పరపతి ఉండదు, దుబారా చెయ్యటానికి డబ్బుండదు. తప్పనిసరిగా వాడు తన బతుకుతెరువు తానే చూచుకోవలసి వస్తుంది. బాధ్యత పైన పడుతుంది. ఆ తరవాత వాడే మారిపోతాడు, ప్రయోజకుడు అవుతాడు కూడా!" అన్నాడు పూజారి.

ఈ సలహా వర్తకుడికి మంచిదిగానే తోచింది. ఆయన తన కుమారుణ్ణి పిలిచి, "నాయనా! నువ్వు దూరదేశం వెళ్లి, ప్రయోజకుడివై, కీర్తి తెస్తే నేను చాలా సంతోషిస్తాను. నీకు ఏ దేశం వెళ్ళాలని ఉంది?" అని అడిగాడు.

"నన్ను కాశీకి పంపించండి!" అన్నాడు శశికేతుడు. 'ఆ పుణ్యక్షేత్రంలో మహాపాపులు విచ్చలవిడిగా సంచరిస్తూ ఉంటా'రని తన స్నేహితులు చెప్పగా వాడు విని ఉన్నాడు.

కాశీనగరంలో పూజారికి దూరపుబంధువు ఒకాయన ఉన్నాడు. ఆయన పేర్తో ఒక ఉత్తరం రాసి పూజారి వర్తకుడికొడుకు కిచ్చాడు. దాన్ని తీసుకుని శశికేతుడు కాశీకి బయలుదేరాడు.

పూజారి చేసిన ఆలోచన ఫలించినట్టే కనబడింది. ఎందుకంటే, కాశీలో ఉండే ఆయనబంధువు శశిని గురించి అప్పడప్పుడూ మంచిగానే ఉత్తరాలు రాస్తూ వచ్చాడు. ఈ ఉత్తరాలను పూజారి పట్టుకుపోయి వర్తకుడికి చదివి వినిపించేవాడు. వర్తకుడూ, ఆయనభార్యాకూడా తమకొడుకు ప్రయోజకుడవుతున్నాడని ఎంతో ముచ్చటపడ్డారు.

ఇంతలో పిడుగుపడ్డట్టయింది. కాశీనుంచి శశికేతుణ్ణి గురించి పూజారికి ఒక ఉత్తరం వచ్చింది. శశికేతుడికీ మరి కొందరు తాగుబోతు, జూదరులకూ ఏదో తగాదా వచ్చింది. దానిఫలితంగా మిగిలినవాళ్లు శశికేతుణ్ణి పొడిచి చంపారు.

దూరదేశం వెళ్లినా శశికేతుడు మారలేదనేది పూజారికి స్పష్టమయింది. ఈ దుర్వార్తను తన స్నేహితుడైన వర్తకుడి చెవిని వెయ్యటం ఎట్లాగో పూజారికి అర్థం కాలేదు. కానీ నిజం దాచి

లాభం లేదు. వర్తకుడిభార్య అసలే రోగిష్ఠి మనిషి. ఒంటరిగా పిలిచి వర్తకుడితోనే ఈ మాట చెప్పటానికి నిర్ణయించాడు– పూజారి. తనకొడుకు దుర్మరణంగురించి విని వర్తకుడు దిమ్మెరపోయాడు. కానీ, ఆయన కన్నీరు కార్చి ఏడవలేదు. "ఇటువంటిదేదో జరుగుతుందని నేను చాలాకాలంగా అనుకుం టూనే ఉన్నాను. భయపడ్డంతా జరిగింది. దూరదేశం పంపితే వాడు మారతాడనుకున్నాం, కానీ వాడు మారలేదు. మారే రకం కూడా కాదు!" అన్నాడాయన విచారంగా.

తరవాత ఆయన పూజారికేసి తిరిగి, "బాబూ! మీరీ సంగతి నా భార్యకు మటుకు తెలియనివ్వకండి. అసలే దాని ఆరోగ్యం ఏమీ బాగాలేదు. ఈ మాట వింటే గుండె పగిలి చచ్చిపోతుంది. అది ఇంక ఎంతో కాలం బతకదు. తన కొడుకు దూరదేశంలో ఉన్నా సుఖంగా ఉన్నాడనుకుంటూ చావనివ్వండి. మీరు ఎప్పటిలాగే మీ బంధువు వ్రాసినట్టుగా ఉత్తరాలు తెచ్చి దానికీ నాకూ వినిపిస్తూ ఉండండి!" అన్నాడు.

"అలాగే చేస్తాను! మీరేమీ విచారించకండి. ఆ ఇల్లాలికి బాధ ఏమాత్రమూ కలగకుండా నేను చూస్తాను!" అన్నాడు పూజారి. ఆయన నెల కొకసారి ఒక ఉత్తరం సృష్టించి, వర్తకుడి ఇంటికి వెళ్ళేవాడు. "ఏమండోయ్, కాశీనుంచి ఇంకో ఉత్తరం వచ్చింది. మీవాడు సుఖంగా ఉన్నానని మీతో మరీ మరీ చెప్పమన్నాడట. అన్నట్టు మీవాడికి త్వరలోనే రాజుగారిదగ్గర కొలువవుతుందని మా బంధువు గట్టిగా అంటున్నాడు!" అనేవాడు.

ఇంకోసారి, "వచ్చే వైశాఖపాడ్యమి నుంచీ మీ వాడు కొలువులో ప్రవేశిస్తున్నాడట!" అనే వాడు.

మరొకసారి, "మీవాడికి రాజుగారు గొప్ప బహుమతి ఇచ్చారట. వాడిపెళ్లివిషయం తానే చూస్తాననికూడా అంటు న్నాడట!" అనే వాడు.

వేరొకసారి, "మీవాడికి మీ ఇద్దరినీ చూడాలని ఎంతగానో ఉందట! సెలవు దొరకటమే వ్యవధిగా తిరిగి వచ్చేస్తానంటున్నాడు!" అనేవాడు.

పూజారి వచ్చినప్పుడల్లా వర్తకుడూ, ఆయన భార్యా ఎంతో ఆనందంతో స్వాగతం చెప్పేవారు. ఆయన చెప్పే విషయాలను అతిశ్రద్ధగా వినేవారు. వర్తకుడిభార్య బాధతో మంచంపట్టి ఉన్నాకూడా, పూజారిని చూడగానే తన మొహంలో బాధ ఏ మాత్రమూ తెలియనివ్వక ఎంతో ఆనందం కనబరిచేది.




"ఇంత మంచిఇల్లాలిని మోసం చేస్తున్నాను గదా!" అని పూజారి లోలోపల చాలా నొచ్చుకునేవాడు. కాని తాను తెచ్చిన అబద్ధపువార్తలు విని, ఆవిడ పొందే ఆనందం చూడ గానే ఆయనకు, "నేను చేసేది మంచి పనే! ఆ ఇల్లాలు ఆనందం పొందటం కన్న కావలిసిందేముంది?" అని పించేది.

ఈ విధంగా నాలుగేళ్లు గడి చాయి. వర్తకుడి భార్యకు జబ్బు క్రమంగా ముదురుతూ వచ్చింది. ఆవిడ క్షయతో పూర్తిగా మంచం పట్టి పోయింది.

ఆమె ఇక ఎంతోకాలం బతకదని వైద్యులు చెప్పేశారు. ఒకనాడు పూజారికి వార్త వచ్చింది. వర్తకుడిభార్య ఇప్పుడో, ఇంకాస్సేపటికో అన్నట్టున్నదని చెప్పారు. పూజారి వెంటనే బయలుదేరి వెళ్లాడు. వర్తకుడు ఇంట్లో లేడు.

"నేను పోతున్నాను, బాబూ! ఆ ముసలాయన భారం నీదే!' అనింది వర్తకుడి భార్య పూజారిని చూడగానే.

"అదేమిటమ్మా? అలా అధైర్యపడతారూ? మీ వాడు బయలుదేరి వస్తున్నాడట! ఇప్పుడే నాకు వార్త వచ్చింది. ఈ పూట కాశీనుంచి కొందరు యాత్రికులు వచ్చారు. వారిద్వారా మా బంధువు కబురుచేశాడు. మీరు త్వరలోనే మీ శశిని కలుసుకుంటారు!" అన్నాడు- పూజారి.

ఆమె విచారంగా నవ్వి, "ఆ మాట నిజమే, నాయనా! ఆ లోకంలో ఇద్దరమూ కలుసుకుంటాం!. ఆశ్చర్యపడకు, బాబూ! నాకు చాలాకాలంగా తెలుసు, మా శశి చనిపోయాడు. కానీ కాశీలో ఉన్న మీ బంధువు ఎంతో ఉత్తముడు! ఆయన ఋణం తీర్చుకోలేం! వాడు పోయిన వర్తమానం నీకెలా తెలిసింది అంటారేమో! కాశిలో మావాడు మరణించినప్పుడే విశ్వేశ్వరుడు నాకు కలలో సాక్షాత్కరించి–"నీ కుమారుణ్ణి నీవు త్వరలో చేరుకుంటావు, ఆ తర్వాత మీ ఆయన" అని చెప్పాడు. నాకూ సమయం దగ్గర పడింది. పుణ్యస్త్రీగా వెళ్లుతున్నాను. శశి పోయినసంగతి తెలిస్తే ముసలాయన ఏనాడో కుంగిపోయేవాడు! ఇన్నాళ్లూ ఈ సంగతి ఆయనకు తెలియకుండా నేను చూసుకున్నాను! ఇక మీదట ఆయనకు తెలియకుండా చూస్తానని నువ్వు ప్రమాణం చెయ్యి, నాయనా! లేకపోతే నేను శాంతంగా చచ్చిపోలేను. మావాడు పోయినట్టు ఆయనకు బతికుండగా తెలియకూడదు! ఇదే నాకోరిక!" అంటూ వర్తకుడి భార్య కన్ను మూసింది.

పూజారికి విచారం కలుగలేదు, పట్టరాని ఆనందం కలిగింది. ఎంత ఆదర్శదంపతులు! ఒకరికి బాధ కలుగకుండా ఉండాలని ఒకరు కార్చిచ్చులాంటి వార్తను తమ హృదయాలలో దాచుకున్నారు. ఆ వర్తకుణ్ణి, ఆయన భార్యనూ మెచ్చుకుంటూ పూజారి తన ఇంటిదారి పట్టాడు.



## అహో! ఆంధ్రభోజా!!

తే.గీ॥ చెరువులను గట్టి రైతుల సేద్యములకు
నీరు మళ్ళించి నట్టి భగీరథుండు
ఐదునూరేండ్లనాడు పట్టాభిషిక్తు
డమల శ్రీకృష్ణదేవరాయలకు నతులు.

మ॥ తను గీర్వాణమదాలసాచరిత సత్యాప్రీణనాదుల్ రచిం
చిన గీర్వాణులు ఉబ్బులై గొనిరి రాశీభూత సౌందర్యపుం
గనులన్ గావ్యములెల్ల, మర్త్యులకు మృగ్యం బయ్యెనే యంచు, తె
ల్గునుడిన్ రాయలు విష్ణుచిత్తుకథ వెల్గుల్ జిమ్మగా వ్రాసెపో!

మ॥ తన రాజ్యంబున పౌరులెల్లరును రత్నాలమ్ము చుండంగ, నూ
తనమౌ చెర్వుల పంటకాల్వలను శ్రద్ధాసక్తులన్ ద్రవ్వగా
ధనమున్ ఖర్చొనరించు రాయలమదిన్ దారాడుభావంబు లీ
జనసామాన్యము, నేటి నేతలకు పూజార్హంబు లీనాటికిన్.

మ॥ తన యాస్థానములోని పండితులు సత్కావ్యంబులన్ వ్రాయగా
తన పేరోలగమందు మంత్రు లరితంత్రధ్వంసముల్ చేయగా
తన సామ్రాజ్యములోని పాలితులు విద్యావంతులై శాంతితో
మనుచుండన్ గనె కృష్ణరాయ లిట భూమానందసందోహమున్.

మ॥ తన మత్తేభము కావ్యకర్తలగు పెద్దన్నాదులన్ మోయగా
తనకున్ దానుగ పల్లకీల కవిదిగ్దంతావళిన్ మోయగా
తన కన్సైగల గూఢచారులగు వార్తాహారులుండగ కీ
ర్తి నిగారంబుగ రాయలేలె భువిఁ గీర్తింపంగ వైదేశికుల్.

ఉ॥ రాయల సీమలోని ప్రతిగ్రామమునందు వెలుంగుచుండు నా
రాయల దానపత్రములొ, రాయలు త్రవ్విన మేటిచెర్వులో
రాయల దత్తమాన్యములొ, రాయలు కట్టిన గోపురంబులో
రాయల కోటలో, గుడుల రాతికి నేర్పిన నాట్యరీతులో!

చం॥ సరిగమ లభ్యసించినవి స్తంభములెల్ల నమూనదీక్షతో
సరిసరి 'సాధు సాధు' అని సర్వజనంబులు మెచ్చ హంపిలో
తరికిట ధీంతధీంతయను తానముకున్ నటనంబుఁ జేయుచున్
బరగెడు రాతిబొమ్మలకు ప్రాణముపోసిన శిల్పి రాయలే!

చం॥ ఒకపరిపాలనాపటుతరోజ్జ్వల నిర్మలకర్మఠుండు పూ
ని, కవనరాజ్యపాలన మనీష వెలింగెడి సత్కవీంద్రునిన్
ప్రకటవిధాతృనిన్ గొలిచి, పాదమునందు నలంకరించె స్వ
ర్ణకలిత, గండపెండరము నవ్యసమాజపు మార్గదర్శియై.

– శ్రీ ఆముదాల మురళి

# సంప్రదాయ వర్ణచిత్రకళ

– శ్రీ ఎ.ఎస్. హేమంతబాబు




**పవిత్ర భారతదేశ సిందూనదీ నాగరికతా పరివాహక ప్రాంతాలైన హరప్పా, మెహంజదారో, లోథల్ ప్రజల నివాస ప్రాంతాలలో మన భారతపురావస్తుశాఖ వారు త్రవ్విన త్రవకాలలో ఆనాటిప్రజల కళకు, వారిదైనందిన జీవితానికి సంబంధించినగృహాలలో, కట్టడాలలోని మట్టి కుండలపై, పాత్రలపై, జాడీలపై చిత్రించిన రేఖాచిత్రాలైన పక్షులు, జంతువులు, జలచరాలు, వృత్తాలు, రేఖలు, అందమైన చిన్ని ఆకృతులు, ముద్రికలపై, తాయెత్తులపై ఉబ్బెత్తుగా తయారించిన జంతువులు, దేవతలు, మానవులు మరియు బొమ్మలిపి, వారు ముద్రికలపై చక్కగా చేసిన యోగ ముద్రలోని పశుపతి శివుడు, చిన్నపాటి లోహంతో నాట్యకత్తె విగ్రహం, రాతి శిల్పాలు, వారికి శిల్ప, చిత్రకళలో గల అవగాహన నైపుణ్యానికి ముఖ్యనిదర్శనాలు.**



'కళ' అనేది కల్పన, వాస్తవాల ప్రకృతి ప్రసాదం. సమ్మిళితమైన బాహ్య ప్రకృతి, ఇటు మనలోని అంతఃర్గతజగత్తు కలగలిసిందే 'కళ'. నిజానికి సమస్త రూపాలకు, వర్ణాలకు, నాదాలకు, స్థితిగతులకు, సృష్టిలయలకు ప్రకృతియే మూలం గదా! అలాంటి ప్రకృతిప్రసాదితాలైన 64 కళలలో **'వర్ణ చిత్రకళ'** ఇంద్రధనుస్సు వర్ణాల సమ్మిళితకళ. కళ అనే రెండక్షరాల పదానికి అర్థం, అనుభూతి తెలియని విద్యావంతులుండరు. గురుదేవులు రవీంద్రులు 'సత్యసుందరాల రసవత్ సమ్మేళనమే కళ' అని నిర్వచించారు. లయ ఆవిష్కృతియే కళ. లయ ఆవిష్కృతమైనప్పుడే రేఖలు, రంగుల కలయికతో **'వర్ణ చిత్రకళ'** అయినది.

'లేఖకస్య యద్రూపం చిత్రే భవతి తద్రూపం'.

ప్రాచీన సాంస్కృతిక, సారస్వత, ఐతిహాసిక గ్రంథాలైన 'విష్ణుధర్మోత్తర పురాణం'లోని 'చిత్రసూత్రం'లో చిత్రకళలోని విధివిధానాలు, నిర్మాణకౌశలం, వర్ణికాభంగం, పనిముట్ల వర్ణన గురించిన విషయాలున్నాయి. ఇంకను వర్ణచిత్రకళగురించి మధ్యకాలానికి చెందిన "అభిలషితార్థ చింతామణి" శివతత్త్వరత్నాకరం, ప్రజాపతి శిల్పం, శిల్పరత్నం, నారదశిల్ప, సరస్వతి శిల్పగ్రంథాల ద్వారా దేవుళ్ళ ప్రతిమాశిల్పశాస్త్రాలను, ఆగమశాస్త్రాలతో చిత్తసంస్కారమానాలతో రూపొందించి ఆరేఖాచిత్రాలకు ప్రథమవర్ణాలు, ద్వితీయవర్ణాలు వంటి మిశ్రమవర్ణాల కలయికలతో వర్ణచిత్రకళ ఆవిర్భవించింది. లలితకళలు మానవ సంస్కృతి, సంప్రదాయాలకు, జీవకోటి జీవనవిధానానికి నిదర్శనాలుగా సాహిత్యం, సంగీతం, నాట్యం, దృశ్యకళలైన చిత్రకళ, శిల్పకళ, వాస్తుకళలు నీరాజనాలు పలుకుతాయి.

"కళ అనంతం, జీవితం క్షణికం"

మనభరతఖండంలో భారతదేశంతో పాటు, తెలుగు నాట యావత్ ప్రపంచంలోని నాగరికతలలో రమారమి క్రీ.శ.4000 ఏళ్లకు పూర్వమే చిత్ర కళకు ఆదిమానవులు, చరిత్ర పూర్వయుగమానవులు శ్రీకారం చుట్టారు. ఆదిమానవుడు రాతిగుహలలో, గుండ్రటి రాళ్లపైన, శిల్పచిత్రాలను, రేఖాచిత్రాలను వేసి, వాటికి ప్రకృతిసిద్ధమైన రాతిమట్టి, ఆకుపసరువర్ణాలను అద్ది ప్రాచీన చిత్రకళకు ఆద్యుడైనాడు.

'చిత్రలేఖనం' అని తెలుగులోను, పెయింటింగ్ అని ఆంగ్లంలోను అంటారని యావత్‌ప్రపంచానికి తెలుసు. భారతీయచిత్రకళలో తెలుగువారు ప్రాచీనకాలం నుండి ఇంటి ముందు వేసే ముత్యాలముగ్గులు, తెలుగుభాషలోని అక్షరాలు, వాటిపదాలు, వాక్యాలు సర్వస్వం లేఖాప్రధానమైనవే గదా!

చరిత్రలో మన తెలుగుప్రాంతంనుండి వెళ్లిన శాతవాహనకాలంనాటి చిత్రకారులు అజంతా గుహలలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచినచిత్రాలను

సంప్రదాయరీతిలో చిత్రించారు. అజంతా చిత్రరీతిలోనే అమరావతి, సాంచి స్థూపాలలోని శిల్పశైలి ప్రస్ఫుటం అవుతున్నది. మరియు లేపాక్షి వీరభద్ర స్వామిఆలయం లోని చిత్రాలు కలంకారీరేఖల, వర్ణాల రీతిలో గోచరిస్తాయి.

'వర్ణం అనేది కాంతిసంజాతం"

అజంతా, లేపాక్షిలోని చిత్రాలవర్ణాలు కాంతి మంతంగా, శోభాయమానంగా, ప్రకృతి స్వతఃసిద్ధంగా ప్రసా దించిన – ధాతురాగ, కుంకుమ, హరితాళ, నీలిమ, కర క్కాయ, ఎర్రమట్టిలాంటివాటితో చిత్రించి, ఈ నాటికీ అవి ప్రపంచ చిత్రకళకు మార్గదర్శకాలైనాయి.

భారతఉపఖండంలో అతిప్రాచీన, తాళపత్ర, కాగి తపుచిత్రప్రతులలో తెలుగునాట చింతామణికథాచిత్రాలు, బాలగోపాలస్తుతిలోని వైష్ణవపరమైన కాగితచిత్రప్రతులు, బహుప్రసిద్ధాలు.





ఇంకా, నేపాల్‌లో రూపొందించిన శివధర్మ, ఆగ్రా ప్రాంతంలోని అరణ్యపర్వం, రాజస్థాన్–గుజరాత్‌లలోని– భాగవతం, గీతగోవిందంగ్రంథాలు ముఖ్యమైన చిత్రప్రతులు.

శ్రీకృష్ణదేవరాయలకాలంలో విజయనగరరాజభవన కుడ్యాలపై, రాజసభలోని కుడ్యాలపై, ముఖద్వారాల కుడి ఎడమల కుడ్యచిత్రాలలో రాయలవారు వస్త్రఆభరణాలతో చక్రవర్తిలాగానే కనిపిస్తాడు. ఒక విదేశీచిత్రకారుడు విజయ నగరకాలంలో చిత్రించిన శ్రీకృష్ణదేవరాయలచిత్రంలో ముఖంపై స్ఫోటకం మచ్చలున్నట్లు, సాధారణ ఎత్తుకలిగి నట్లు కనపడుతుంది. మరి రామాయణ, మహాభార తాలలోను, కృష్ణుని ద్వారకానగరంలోను, చిత్రశాలలు, చిత్రకారులు ఉన్నట్లు పేర్కొనబడింది. ఈ చిత్రశాలలో శుభకరమైన చిత్రాలనే చిత్రించడం వల్ల ఈ చిత్రాలను 'మాంగల్యలేఖ్య' అని అంటారు.

మన భారతావనిలోని అలనాటి ప్రముఖచిత్రకారు లలో 'రాజారవివర్మ' తెలుగువాడుకాకపోయినా, చిత్రకళను తెలుగువారినుండి నేర్చుకొని, తంజావూరు చిత్రశైలిని నేర్చు కుని, మరొక చిత్రకారునిద్వారా తైలవర్ణచిత్రకళలోని మెల కువలను నేర్చుకొని, మనభారతీయ సంప్రదాయ చిత్రకళా సంస్కృతిని ప్రతిబింబింపజేస్తూ సరస్వతి, లక్ష్మి, రామాయణ, మహాభారత, భాగవత, ఐతిహాసికఘట్టాల నెన్నింటినో చిత్రించి, జాతీయ అంతర్జాతీయఖ్యాతి గడించాడు.

"దృశ్యచిత్రకళ విద్యార్థిసృజనాత్మకశక్తినీ, ఆలోచనా శక్తినీ పెంచడానికి దోహదపడుతుంది".






# లీలామృతధారలు

- శ్రీ ఇంగువ కిరణ్‌కుమార్

ఒకటా..? రెండా..? ఆ దేవదేవుడు చేసే లీలలు. భక్తికి కొలమానం అంటూ ఉంటే ఆ కొలమానం ప్రకారం అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన ఆ ఏడుకొండలవాడికి నేను ఒక అతి సామాన్యమైన భక్తుణ్ణి. నావంటి ఒక అల్పుడైన భక్తుడే ఆ స్వామివారి అద్భుత లీలాప్రవాహాన్ని పొందగలిగినప్పుడు, ఎందరో మహాభక్తులు ఆ స్వామివారి అనంతలీలాసాగరాన్ని ఆస్వాదించ గలుగుతారనటంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు.

మానాన్నగారు ఒక బ్యాంకుఉద్యోగి. ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి ఊర్లు తిరిగే అవకాశం బ్యాంకుద్వారా మాకు లభించేది. అటువంటి ప్రయాణాలలో తిరుమల స్వామి వారిదర్శనం తప్పక ఉండేట్లు ఆయన ప్రయత్నించేవారు. అజ్ఞానాంధకారం వీడని చిన్నతనంలో "ఎప్పుడూ తిరుపతి కేనా?" అని నేను భావించేవాణ్ణి. కానీ ఆ స్వామివారు నామనస్సులో ఎక్కడో లోపలిపొరలలో తన ముద్రను నాపైన వేస్తున్నారనే సత్యాన్ని అప్పుడు నేను గ్రహించలేకపోయాను.

అలా ఒకసారి స్వామివారిదర్శనమైన తరువాత బాపట్లలో మా బంధువుల ఇంటికి చేరుకున్నాం. అక్కడనుండి చీరాల, సూర్యలంక బీచ్ చూడటానికి వెళ్లాం. నా జీవితంలో శ్రీవేంకటేశ్వరస్వామివారిలీలా ప్రవాహం నాఊహకు అందినంత వరకూ అక్కడనుండే మొదలైవుంటుందను కుంటున్నాను. అందరికంటే వయస్సులో అతి చిన్నవాడినైన నేను ఆ సముద్రపు అలలతాకిడికి తట్టుకోలేక, కాళ్లక్రింద ఇసుక అలలతోపాటే జారిపోతూ ఉంటే– నేనుకూడా పట్టుతప్పి కొట్టుకునిపోబోయాను. అయితే చివరిక్షణంలో మా అమ్మ నాచేయి పట్టుకోవడంతో సముద్రంలోకి కొట్టుకుపోకుండా ఆగ గలిగాను.

హైదరాబాద్‌లో ప్రతి సంక్రాంతిపండుగకు గాలిపటాలు ఎగుర వేయటం ఆనవాయితీ. అక్కడే పుట్టిపెరిగిన నేనుకూడా మేడలెక్కి గాలి పటాలు ఎగురవేసేవాణ్ణి. నేను స్కూల్‌లో చదువుకుంటున్న రోజుల్లో ఒకసారి మేడమీద గాలిపటం ఎగురవేస్తూ వెనక్కి కదులుతూ వెళ్లి పిట్టగోడ కూడాలేని మొదటిఅంతస్తు మీదనుండి క్రిందనేలపై పడ్డాను. అలా పడేటప్పుడు కిటికీకి సన్‌షేడ్‌గా పెట్టిన నాపరాతిమీద పడి, అది విరిగిపోయి ఆ రాతితోసహా క్రింద చతికిలపడ్డట్లుగా పడ్డాను. పగిలిన ఆ రాయిముక్క నాకుడిచేతిపైన పడింది. ఆ బరువైన రాయిని నేను తోయటానికి ప్రయత్నించటంతో అది చేతిపైన గీచుకొనిపోయి ఏర్పడ్డ వాతలు మినహా నాకు ఏ ఇతరగాయాలు కాలేదు.

నేను స్కూల్‌లో చదువుకునే రోజుల్లోనే ఇంకొక సందర్భంలోకూడా గాలిపటం ఎగుర వేస్తూ రెండవ అంతస్తుమేడ నుండి మొదటి అంతస్తులో పడి స్పృహతప్పిపోయి కొద్దిసేపటి తరువాత తేరుకొన్నాను. ఆ పడటంలో ఒక అడుగు తేడా వచ్చినట్లయితే మొదటి అంతస్తు బదులుగా గ్రౌండ్‌ఫ్లోర్‌లో పడి ఉండేవాణ్ణి.

ఆ తర్వాత అజ్ఞానాంధకారంనుండే బయటపడి నేనుకూడా శ్రీవేంకటే శ్వరస్వామివారిభక్తుణ్ణయ్యాను. వృత్తి రీత్యా బ్యాంకు ఉద్యోగిని అయిన నేను సాధ్యమైనంతవరకూ సంవత్సరానికి ఒకసారి ఆ తిరుమలస్వామివారిని దర్శించుకుంటూ కొండకు నడుచుకుంటూ వెళ్లేవాణ్ణి.

1996 సంవత్సరం ఫిబ్రవరి 6న హైదరాబాద్‌లో మోపెడ్‌పై ఆఫీసుకు వెళ్తున్న నేను రోడ్డుదాటే క్రమంలో ఒక లారీనన్ను గుద్దుకొనింది. ఆధాటికి నామోపెడ్ మూడు ముక్కలైంది. నేను గాలిలోకి ఎగిరి రోడ్డుప్రక్కన పడ్డాను. నన్ను గుద్దుకున్న లారీవేగంగా వచ్చినా, ఎడమకాలితొడపైన నిల బడి ఆగిపోయింది. అయితే ఆ స్వామివారిదయవల్ల నా కాలు వర్షపు నీటి





ప్రవాహానికి కోతకోయబడి చిన్నకాలువ మాదిరిగా తయారైన పొడవాటిగుంటలో ఇమిడిపోయినట్లు పడింది. ఆ కాలువపై ఆగినలారీటైరుబరువు కాలువఅంచులపైన పడినప్పటికీ టైరు వంపు నాఎడమకాలితొడమీద తీవ్రమైన ఒత్తిడి కలిగించడంతో ఒక నెలపాటు సాధారణంగా నడవలేక చంకల క్రింద కర్రల సహాయంతో నడిచేవాడిని. అదేకాక నాకాలర్‌బోన్, ఊపిరి తిత్తులకుహరపు ఎముకలుకూడా విరిగినాయి. కానీ రెండు, మూడునెలల్లోనే పూర్తిగా కోలుకొని మోటర్‌సైకిల్ నడపగలిగాను.

కొంతకాలం తరువాత నా వివాహం జరిగింది. నా వివాహమైన సంవత్సరంన్నర తరువాత అంటే సెప్టెంబరు 17, 2000వ సంవత్సరంలో గ్యులియన్ బ్యారీ సిండ్రోమ్ (జి.బి.ఎస్) అనే విచిత్రమైన వ్యాధిబారిన పడి, నాశరీరం పూర్తిగా చచ్చుబడిపోయింది. కేవలం కంటిరెప్పలుమాత్రమే కదపగలిగేవాణ్ణి. నాఊపిరితిత్తులుకూడా పనిచేయకపోవడంతో వెంటిలేటర్ ద్వారా నేను శ్వాసించే ఏర్పాటు చేశారు.

కదలికలలో పెద్దగా మార్పులు రాలేదు. కంటిరెప్పలతోపాటు కేవలం తల మాత్రమే త్రిప్పగలిగే పరిస్థితికి చేరుకున్నాను. ఒక ప్రక్క లక్షలలో అవుతున్నఖర్చులు, మరోపక్క రోజురోజుకు కష్టమౌ తున్న ఆర్థికపరిస్థితి, ఇంకొక ప్రక్క ఏమాత్రం గుణం చూపని నా ఆరోగ్యపరిస్థితి గమనించిన డాక్టర్లు నా ట్రీట్‌మెంట్ ఆపినట్లైతే ఆర్థికంగా మరింత దెబ్బతినకుండా ఉండవచ్చనీ సూచించారు. ఒకవేళ నేను బతికి బయటపడినా ఎందుకైనా పనికివస్తానో, లేదో అని అప్పటికి మాకు పిల్లలుకూడా లేనందున నన్ను వదిలివెళ్ళిపోమని నా భార్యకు కొంతమంది సూచించారు. అయితే నా శ్రీమతి అన్ని అవాంతరాలను ఎదుర్కొంటూ నాచికిత్స కొనసాగే విధంగా ఏర్పాట్లుచేసింది.

ఆమె నమ్మకాన్ని నిలబెడుతూ నేను 85 రోజుల తరువాత వెంటిలేటర్ లేకుండా గాలిపీల్చుకొనే శక్తి సాధించాను. 124 రోజుల తర్వాత శరీరం కదలికలలో పెద్దగా మార్పులులేని పరిస్థితులలో ఆస్పత్రినుంచి డిశ్చార్జి చేయబడ్డాను. నా ట్రీట్‌మెంట్

నేను హాస్పటల్‌లో అడ్మిట్ చేయబడినప్పుడు మా వద్ద కేవలం 500 రూపాయిలు మాత్రమే ఉన్నాయి. చికిత్సకై రోజుకు కొన్నివేలు ఖర్చు అయ్యేవి. కానీ ఏనాడూ డబ్బులేక నాకు చికిత్స ఆగలేదు. ఆ దేవదేవుని దయ వల్ల ఊహించని విధంగా నా చికిత్సకు డబ్బు ఏర్పాటయ్యేది. కొంతమంది బంధువులు, మా బ్యాంకువారు సమయానికి ఆర్థికసహకారం అందించారు. 54రోజులు ట్రీట్‌మెంట్ గడిచిన తర్వాత కూడా నాశరీరం



సమయంలో ఆక్సిజన్ సరఫరాలలో ఇబ్బందుల కారణంగా, మరికొన్ని ఇతరకారణాలవల్ల అనేకసార్లుమరణం అంచులవరకూ వెళ్ళిన నేను ఆఖరు క్షణాలలో నా భార్య చూపిన సమయస్ఫూర్తి మరియు ఆభగవంతునిదయవల్ల ప్రాణాలతో బయటపడ్డాను.

ఆసుపత్రి నుండి డిశ్చార్జి అయిన తర్వాత దాదాపు 9 నెలల పాటు మంచంమీదే ఉన్న నేను వేళ్ళతో పెన్ను పట్టు కొనగల శక్తిని, వాకర్ సహాయంతో చిన్నగా నడవగల సామ ర్థాన్నీ పొంది, దాదాపు 13నెలల తరువాత తిరిగి ఉద్యోగానికి వెళ్ళటం మొదలుపెట్టాను. కానీ ఆ వ్యాధివల్ల నేను 87% వికలాంగుడిగా మిగిలాను.

తరువాత కాలంలో 2003వ సంవత్సరంలో ఒక కొడుకును కని, సొంత ఇల్లు ఏర్పాటు చేసుకోగలగడమేకాక - మూడుచక్రాల స్కూటర్‌ను నడిపే శక్తినికూడా పొందగలిగాను. అంతేకాకుండా ఆ స్వామివారిదయతో 2013వ సంవత్సరంలో ఒక కార్‌ను కొని చేతులతో నడపగలిగే విధంగా మార్పించుకొని నడపటం నేర్చుకొన్నాను. అక్టోబరు 15, 2015 నాడు హైదరా బాద్‌నుండి తిరుమలకు స్వయంగా కారును నడుపుతూ వచ్చి, స్వామివారి దర్శనం చేసుకొని వెళ్ళగలిగాను.

ఇలా ఒకటా? రెండా? ఎన్ని చెప్పినా తక్కువే అనుకొనే విధంగా అనేకలీలలు స్వామివారు నాజీవితంలో చూపించారు. ఇప్పటివరకూ నాజీవితంలో ఆ స్వామివారిదయవల్ల నేను ఏవిధంగా ప్రాణాపాయ పరిస్థితుల నుండి బయటపడ్డాను అనే విషయాలనుమాత్రమే వివరించాను. ఇంక, నా సాధారణ జీవితంలో ఆస్వామివారికృపను, అభయాన్నీ పొందిన సంఘ టనలు కోకొల్లలు.

“హరి ఎందెందు వెదికినా అందందే కలదు!” అన్నారు కదా! మరి కోటానుకోట్లమందిభక్తులు అనేకవందల, వేల కిలోమీటర్లు ప్రయాణం చేసి, ఆ స్వామివారిదర్శనంకోసం తిరు మలకు చేరుకొంటున్నారెందుకు? ఎన్ని వ్యయప్రయాసలకోర్చి ఆనందనిలయాన్ని చేరుకొన్నా-దొరికేది క్షణమాత్ర దర్శనభాగ్యమే అని తెలిసినా ఆ తిరువేంకటాధీశునిదర్శనానికి ఆపరుగులెం దుకు? ఎన్నిసార్లు ఎంతసేపు దర్శనం చేసుకొన్నా ఇంకా తనివి తీరలేదే అనే బాధ ఎందుకు?

ఎందుకంటే వృత్తిరీత్యా తల్లిదండ్రులను విడిచి వేరే ప్రాంతాలలో ఉంటున్న పిల్లలు తమతల్లిదండ్రులను చూడటా నికి ఏవిధంగా చేరుకొంటారో అందుకే! భౌతికంగా ఏ తల్లిదండ్రుల పిల్లలమైనా ఆత్మలపరంగా ఆనంద నిలయాధీశు డైన ఆదేవదేవునిపిల్లలమే! ఆవిధంగా తన వక్షఃస్థలంలో ఇద్దరు అమ్మలను నిలుపుకొన్న ఆ శ్రీవేంకటేశ్వరస్వామి ఉన్న ఆనంద నిలయమే మనకు నిజగృహమువంటిది. ఆ తల్లిదండ్రుల దర్శన భాగ్యానంతరపు అలౌకికఆనందంతో మనము తిరిగి మన ప్రస్తుతగృహాలను చేరుకొంటున్నాము.

దైవస్వరూపులుగా భావింబడుతున్న స్వాముల, బాబాల మహిమలకు ముగ్ధులై అనేకమంది వారినే దైవంగా పూజిస్తు న్నారు. దైవస్వరూపాలైన మనుషులే అనేక మహిమలను చూపించగలిగినట్లైతే స్వయంగా ఆ భగవంతుడిమహిమలు ఎంత అపారమైనవో గుర్తించినట్లైతే మన వెతుకులాటలను మాని, భగవత్సాన్నిధ్యంలోనే తృప్తిని పొంది జీవనపరమార్థాన్ని సాధించ గలమని నానమ్మకం.

ఆ దేవదేవులను మనతల్లిదండ్రులుగా భావించి, అనేక కోరికలు కోరుకొంటున్నాము. అది మనహక్కుగా భావిస్తాము. మరి వారిపట్ల మనబాధ్యత ఏమిటి?

నేను ఎక్కడో చదివిన ఈక్రిందినాలుగుపంక్తులు మన బాధ్యతను చాలా చక్కగా వివరిస్తున్నాయని నేను భావిస్తున్నాను.

Surrender yourself to the evermercyful.
Nothing more, Nothing less, Nothing else.

అత్యంతదయార్ద్రుడైన దేవునికి నిన్ను నువ్వు అర్పిం చుకో. అంతకంటే ఎక్కువా వద్దు, తక్కువా వద్దు, ఇంకేమి వద్దు.

ఒక హిందువుగా జన్మించి, ఆ వేంకటేశునికి భక్తుడయ్యే అవకాశం నాపూర్వజన్మసుకృతంగా భావిస్తున్నాను.

శ్రీవేంకటేశ్వరస్వామివారిలీలామృతధారలలో జీవన సాఫల్యతను పొంది ఆదేవదేవునివద్దకే చేరుకోవాలని ఆశిస్తూ...







# భూలోక కల్పవృక్షం

- ఆచార్య మహాసముద్రం దేవకి

సిద్ధాన్నరూపంలో మానవునికి ప్రకృతిమాత ప్రసాదించిన ఉత్తమఫలాల్లో మొదట పేర్కొనదగింది కొబ్బరి. లేత, దోర, ముదురు, ఎండిన దశలన్నిటిలోను నిరభ్యంతరంగా దీన్ని వాడవచ్చు. దైనందినకార్యాలన్నిట్లోను కొబ్బరికాయల్ని వాడడం ఉంది. పెళ్లికూతురు పీటలమీదికి పచ్చికొబ్బరికాయను చేతబట్టుకొని, వస్తుంది. పూజాసమయాల్లో దేవతలకు కొబ్బరికాయను కొట్టి నివేదిస్తారు. శుభసమయాల్లో బంధుమిత్రులకు తాంబూలంతో పాటు కొబ్బరికాయ నిచ్చి సత్కరిస్తారు. కొబ్బరికాయను కొట్టిన తర్వాత నీళ్లను తీర్థంగాను, కొబ్బరిని ప్రసాదంగాను స్వీకరిస్తారు. పేరంటాలలో కొబ్బరితో, బెల్లం లేదా కలకండ కలిపి సారె పంచుతారు. పెళ్లి సమయంలో తాళిబొట్టును కొబ్బరికాయ మీద ఉంచి, అందరికీ తాకిస్తారు. కలశం పెట్టడానికి కొబ్బరికాయను విధిగా వాడతారు.

సంస్కృతంలో కొబ్బరికి నారికేళం, దృఢఫలం, మహా ఫలం, తృణఫలం, దీర్ఘఫలం, రసఫలం, వరారోహ, సునీలక, దీర్ఘదండ, స్కంధఫలం, సుతుంగ, జీవతరు, మహాప్రాంశు, విశ్వామిత్రఫల మొదలైన పేర్లెన్నో ఉన్నాయి. తెలుగులో దీన్ని టెంకాయ, కొబ్బరి అని వ్యవహరిస్తారు. హిందీలో నారియల్, అరవంలో తెంగాయ్, కన్నడంలో తెంగిన, బెంగాళీలో నారికెళ్ అని పిలుస్తారు.

మొదట కొబ్బరిచెట్లు ఉష్ణప్రాంతాల్లో సముద్రతీరంలో మాత్రం పెరిగేవి. మానవుడు క్రమంగా దాన్ని అన్నిప్రదేశాలకూ వ్యాపింపచేశాడు. పొడుగ్గా, అందంగా ఎదిగే ఈ చెట్టు ఆకుమట్టలు పదిహేనడుగుల పొడవుంటాయి. ఈ చెట్లలో చాలా రకాలున్నాయి. వీటిలో పెద్దరకాలు సింహళం, నికోబార్ దీవుల్లో ఉన్నాయి. భారతదేశంలోనిరకాల్లో– మలబార్‌లోని 'కవ్వడర్' పెద్దది. ఆంధ్రదేశంలో మధ్యస్థమైనవి, పొట్టిరకాలు ఉన్నాయి. తూర్పుగోదావరిప్రాంతంలో నీళ్లకు చెందిన గంగా బొండాలు విరివిగా దొరుకుతాయి. మంచి ఎండ, సముద్రం, గాలి, ఇసుకనేల, మంచినీళ్లు ఉన్నచోట కొబ్బరి బాగా ఎదుగుతుంది.

కేరళలాంటిప్రాంతాల్లో ఆహారంలో విరివిగా కొబ్బరి ఉపయోగిస్తారు. పిండివంటలు కొబ్బరినూనెతోనే చేసుకుంటారు. కూరల్లో కొబ్బరికోరు కలుపుతారు.

టెంకాయ పుష్టికరమైన ఆహారం. వీటిలో ప్రొటీనులు, కొవ్వు, మధురపదార్థాలు, ఖనిజాలు పచ్చి, పండుస్థితుల్ని బట్టి అమరి ఉన్నాయి. బియ్యం తర్వాత మానవజాతియొక్క స్వాభావికాహారమిది. తక్కువ పరిమాణం నుండి ఎక్కువ బలాన్నీ సహనాన్నీ చురుకుదనాన్నీ ఇచ్చే దీన్ని రోజుకొక్క కాయవాడినా చాలు. ఔషధపరంగా కొబ్బరి చాలా విలువైంది. ఇది రక్తాన్ని శుద్ధి చేస్తుంది. జీర్ణశక్తిని పెంచుతుంది. శరీరంలోని మలిన పదార్థాల్ని వెడలించి శుభ్రపరుస్తుంది. నాడీదౌర్బల్యాన్ని తొలగిస్తుంది.

కొబ్బరి మొవ్వు, పువ్వు, లేతకాయ, ముదురుకాయ, ఎండుకొబ్బరి, టెంకాయనీళ్లు, కల్లు, పాలు, నూనె, జిగురు మొదలైనవాటిని ఆహారంగా ఉపయోగిస్తారు. ఈ చెట్టులోని వివిధ భాగాలు ఔషధాలుగా ఉపయోగపడతాయి. పిందె రంగు, నార, కలప, గచ్చు, చిప్ప, డిప్ప గుజ్జు మొదలగునవి పారిశ్రామిక ప్రయోజనాన్ని కలిగి ఉన్నాయి. కొబ్బరికాయలో అరుదుగా ముత్యాల్లాంటి గట్టి ముద్దలుంటాయి. వాటికి మాంత్రికశక్తి ఉందని కొందరి నమ్మకం. కొబ్బరినూనె క్రిమి సంహారిణి. శిరోజాలకు, శరీరానికి దీన్ని విరివిగా వాడతారు. దీనికి మలబారు నెయ్యి అని మరో పేరుంది. చెట్టు చివర ఉండేదాన్ని 'మొవ్వ' అంటారు. దీన్ని ఇంగ్లీషులో 'కోకోనట్, క్యాబేజి' అని పిలుస్తారు. ఇది తినడానికి చాలారుచిగా ఉంటుంది. దీనితో కొన్నిప్రాంతాల్లో నిలువపచ్చళ్లు పెడతారు.

కొబ్బరి చెట్టు ఇచ్చే మొదటి ఆహారం కల్లు అయితే కాయల్లో ఏర్పడే మొదటి ఆహారం నీళ్లు. ఇది చల్లని రుచికరమైన పానీయం. ఇది తాపాన్ని తగ్గిస్తుంది. ఉగ్రమూర్తి, హాలాహల భక్షకుడు అయిన శివుని అభిషేకానికి కొబ్బరినీళ్లు ఉపయోగించడం మన అలవాటు. దేహతాపాన్ని చల్లార్చడంలో దీనికి మించింది లేదనడానికి ఇదొక గుర్తు. వాతావరణంలోని స్థితికంటే కొబ్బరినీళ్లు ఇరవైఐదుడిగ్రీలు చల్లగా ఉంటాయి. కాబట్టే అవి మంచినీళ్లకంటే చల్లదనాన్నిస్తాయి. రజోగుణాన్ని, తగ్గించి, దాహాన్ని నివారిస్తాయి. ఇది మూత్రపిండాల్ని శుభ్రపరచడమేగాక, శరీరంలోని క్రిముల్ని సంహరించి, సంపూర్ణారోగ్యాన్నిస్తుంది. సున్నంతో కొబ్బరినీళ్లు కలపడంవల్ల వెల్ల బాగా ఉంటుంది. ఆముదం తయారీలోను కొబ్బరి నీళ్లు వాడతారు. పోకచెక్కల వగరు తగ్గడానికి, రబ్బరు గడ్డకట్టడానికి, కత్తులు తుడవడానికి, పాషాణానికి అనుపానంగాను, చెడు మందుల దోషాన్ని నివారించడానికి మధుమేహరోగులకు, వాపులకు, పార్శ్వపు నొప్పులకు కొబ్బరినీళ్లు బాగా పనికి వస్తాయి.

లేతమీగడ కొబ్బరి పిత్తాన్ని నశింపజేస్తే-ముదురు కొబ్బరి దప్పిని, శోషను నివారిస్తుంది. వండినకొబ్బరి అజీర్ణకరంగా ఉంటుంది. కొబ్బరికోరునుండి తీసినపాలను మందుల్లో అనుపానంగా వాడతారు. పాలు అలసటను పోగొట్టి శక్తినిస్తాయి. కలరా రోగులకు ఇది మంచిపానీయం. కొబ్బరిపాలను తలమీద మర్దిస్తే వెంట్రుకలు ఊడిపోకుండా ఉంటాయి. వృద్ధాప్యంలో ఉన్నవారు ఈ పాలు పుచ్చుకోరాదు. అలాగే రుచిగా ఉందని ఎవరూ దాన్ని ఎక్కువగా సేవించరాదు.

బాగాపండిన టెంకాయ తియ్యగా, రుచిగా ఉంటుంది. ఇది వాతాన్నీ, దంతరోగాన్నీ నివారిస్తుంది. ముదిరిన కొబ్బరి కష్టంమీద జీర్ణమవుతుంది. అందుకే ఎక్కువగా వాడ కూడదు. పండుతిన్నా, పచ్చిది తిన్నా, ఆహారంలో కొబ్బరి అవసరం చాలా ఉంది. తెలుగులో కొబ్బరికి సంబంధించి అది నడిమికి రెండుగా పగిలితే మంచిదనీ, మొలకవస్తే చాలా మంచి దనీ, చిన్న చిన్న ముక్కలు కారాదనీ ఇలా ఎన్నో నమ్మకాలున్నాయి. వందలాది పొడుపుకథలున్నాయి.

**రాజావారికి నచ్చే చిన్నది, రాజ్యాలెల్లా మెచ్చే చిన్నది ,**
**బంగారువారింటి కోడలూ, సిరిగలవారిఆడపడుచూ**
**చేంతాడులో తోడకుండా చెంబుతో ముంచకుండా**
**నీటుగానూ కుల్కుతున్నది నీళ్లు తెస్తానంటున్నది**
**నిటారు నిలువులు పటారు బయళ్లు మజ్జిగముంతలు మాణిక్యాలు**
**చెయ్యనికుండ పొయ్యని నీళ్లు వెయ్యని సున్నం తియ్యగ వుండు**

ఇలాంటివి తెలుగునాట ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. కొబ్బరివల్ల చేకూరే ఉపయోగాలు అనంతమైనవి. ఏడాదికి ఎన్ని రోజులున్నాయో కొబ్బరివల్ల సిద్ధించే ప్రయోజనాలు కూడా అన్ని ఉన్నాయంటారు. అందుకే కొబ్బరిచెట్టును **'భూలోక కల్పవృక్షం'** అంటారు.



# శరణాగత రక్షణం

– 'సారస్వత కళానిధి' డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి

శాంతిపర్వం సత్యధర్మప్రతిష్ఠాపన పరమప్రయోజనంగా కలిగింది. ధర్మార్థకామమోక్షచతుర్విధ పురుషార్థసాధనావశ్యకతను కురువృద్ధుడైన భీష్మపితామహుడు ధర్మరాజుకు బోధించాడు. శాంతిపర్వంలోని ఉపాఖ్యానాలలో తిర్యక్కులు, జడాలు మొదలుకొని దేవర్షులవరకు సంబంధించిన కథలున్నాయి. ధర్మప్రతిపాదన సందర్భాలలో విశేషించి, తిర్యగ్జడ సంబంధమైన కథలు ప్రతీకాత్మకంగా కన్పిస్తాయి. ఒక్కొక్కపాత్ర లోకంలోని ఒక్కొక్క ధర్మానికో, స్వభావానికో ప్రతీకగా భావించి, మానవప్రవృత్తులకు ప్రతినిధులుగా వర్తించి పఠితలకు ఉపదేశం చేస్తూ ఉంటాయి. వాటిలో లుబ్ధక కపోతోపాఖ్యానం సుప్రసిద్ధం. చక్కని నిర్మాణశిల్పాన్ని సంతరించుకున్న శిల్పఖండం, లుబ్ధకకపోతోపాఖ్యానం. శరణాగతరక్షకునికి లభించే సత్ఫలితాలను వివరించ వలసిందని ధర్మరాజు అంపశయ్యపై నున్న భీష్మ పితామహుణ్ణి ప్రార్థించిన సందర్భంలో ఆపదలో ఉన్నవారిని రక్షించటంవల్ల కలిగే పరమప్రయోజనం దివ్యత్వమని పలికి, ఆ నీతిని బోధించే లుబ్ధక కపోతోపాఖ్యానాన్ని వినిపించాడు– భీష్ముడు.

ఒక పాపాత్ముడైన వేటగాడు ఉండేవాడు. అతడు పిట్టలను కొట్టి, పొట్టపోసుకుంటూ జీవించేవాడు. ఒకనాడు పిట్టలను కొట్టే పనిముట్లను సమకూర్చుకొని, అడవిలో తిరుగుతూ ఉండగా పెద్దగాలీవానా వచ్చింది. ఆ గాలివానకు అడవిలోనిజీవులకు ముప్పు వాటిల్లింది. అడవి అంతా జలమయం అయింది. వేటగాడు బెదిరిపోయాడు. గుట్టమీద గుబురుగా ఉన్న చెట్టుకింద చేరాడు. ఆ రాత్రి అక్కడి బండరాతిమీద చలిగాలికి గడగడ వణుకుతూ పడుకున్నాడు. ఆ చెట్టు తొఱ్ఱలో ఉన్న ఒక మగకపోతం తన భార్య మేతకు వెళ్ళి, అప్పటివరకు తిరిగి రాలేదని భయంతో ఎదురు చూస్తూ ఉంది. పెంటిగువ్వ గుణగణాలను గుర్తుచేసుకుంటూ విలపిస్తూ ఉంది.

బోయవాడివలలో చిక్కుకున్న ఆడుపావురం తనను గుర్తించి భర్త పొందుతున్న ఆర్తిని స్వయంగా విన్నది. తన జన్మకృతార్థమైందని సంతసించింది. పతి మెప్పుపొందిన అమిత పుణ్యాత్మురాలని భావించింది.

తన జన్మ ధన్యమైందని, తాను యముణ్ణికూడా జయించానని ఆనందపరవశురాలైంది. భారతీయకుటుంబ వ్యవస్థలో సతీపతుల అన్యోన్యానురాగానికి, హర్షాతిరేకానికి ఈ భావన పరాకోటి. వెంటనే, తన ఉనికిని పతికి తెలిపింది. 'విధికృతంబునకు వగవంబని లేద'ని అనునయించింది. ఆదుకొనుమంటూ ఆశ్రయించిన వారిని కనికరంతో ఆదరించటం కంటే మించిన పుణ్యం మరొకటి లేదని, తాము నివసించే మహావృక్షాన్ని ఆశ్రయించిన వేటకాణ్ణి దర్శించవలసిందని పతిని ప్రార్థించింది.

మగపావురం భార్యా వియోగదుఃఖాన్ని మరచి, వేటగాణ్ణి ఆదరించింది. మనుష్యసంభాషణతో ఇలా పలికింది. 'అన్నా! మా ఇంటికి అతిథిగా విచ్చేశావు. శరణుకోరుతున్నావు. నీకు నేను చేయవలసిన సత్కార్యాలు ఏవి? నీ కోరిక ఏది? వినిపింపు'మన్నది.

తెలుగునాట సంస్కారవంతులైన గృహస్థుల నోటికి నేటికీ ఈ పద్యం అతిథిసత్కారసమయాలలో వినిపిస్తుంది. తిక్కన తేటతెలుగు మాటలు తెలుగువారిఆచారాలకు అందమైన బాటలు.

వేటగాడు చలికి తన అవయవాలు వణకిపోతున్నాయని, చలి బారి నుండి తనను రక్షించవలసిందని ప్రార్థించాడు. మగగువ్వ వెంటనే సమీపంలోని పల్లెకు పోయి, చిదుగు చివర అంటుకున్న నిప్పు తెచ్చి చలిమంట ఏర్పాటు చేసింది.

చలి తీర్చుకున్న బోయవాని ఆకలిని తెలిసికొని మగగువ్వ మంటలో తాను దూకి బోయకు ఆహారం అయ్యింది. అది చూసిన వేటగాడు విస్మయంతో మ్రాన్పడిపోయాడు. లోకంలో అంతటి సాహసం ఉంటుందా? అని తలపోశాడు. తన నడవడిక లోకానికి ఎంతటి దుర్భరమైన వేదనను కలిగిస్తుందో కదా అని చింతించాడు.



ఇకపై ఇలాంటి పాపకర్మలను చేయజాలనని నిర్ణయించుకున్నాడు. మనస్సులో శాంతిని పొంది తన వలలోని పిట్టలను విడిచి పెట్టాడు. వలనుండి బయటపడిన ఆడగువ్వ పతి తనుత్యాగాన్ని చూచి శోకాకులిత అయింది. పతితోడిదే తన లోకంగా భావించి, తానుకూడా మంటలో పడి సహగమనం చేసింది. జంటగువ్వల దివ్య వర్తనాన్ని కళ్ళారా చూచిన వేటగాడు అరణ్యాలకు పోయి దావాగ్నిలో తనువు దహింప చేసుకున్నాడు. ముగ్గురు దైవత్వాన్ని పొందారు.

ఇది కథలో గువ్వల జంట శరణాగతరక్షావ్రత దీక్షితులైన ఆదర్శ దంపతులకు ప్రతీక. వారి అతిథిభక్తి తనూత్యాగానికి సైతం వెనుకంజ వేయనీయలేదు. ప్రకృతి రీత్యా అవి పక్షులైనా ప్రవృత్తి రీత్యా ఏ పుణ్యమూర్తులకూ తక్కువకాని ఔదర్యానికి నిదర్శనాలు.

శరణాగతరక్షణవల్ల మహోన్నతమైన గౌరవాన్ని మానవుడు పొందగలడు. నేటిసమాజంలో బుద్ధి జీవి అయిన మానవుడు ఈ ధర్మ సూక్ష్మాన్ని అర్థం చేసుకొని ప్రవర్తించవలెననే నీతి ఈ ఉపాఖ్యానంద్వారా బోధించబడింది. ఇటువంటి అమూల్యమైన వ్యక్తిత్వ రత్నాలనెన్నింటినో మహాభారత సాగరాన్ని మథించిన మానవుడు సముపార్జించగలడు.

# శ్రీకృష్ణభగవద్విజయము

రచయిత - డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహరావు,
సైజు-1/8 డెమ్మీ, పుటలు-12+221, వెల-రూ.216/-,
ప్రతులకు - డా॥ వి.ఎల్.నరసింహారావు, జి-2, గార్డెన్‌టవర్స్,
ఎన్.టి.ఆర్.స్టేడియం ఎదురుగా, చంద్రమౌళినగర్,
గుంటూరు - 522 007. ఫోన్ - 95738 84352

'శ్రీకృష్ణభగవద్విజయం' - నవల. క్రొత్తదనాన్ని నింపుకొన్ననవల. ఇందులో పౌరాణికం, ఐతిహాసికం-అంశాల్తో పాటు క్రొత్త పాత్రలూ కన్పిస్తాయి. ఇది దాదాపు నాటకీయఫక్కీలో సాగిన వినూత్ననవల.

'నే నందర మెప్పింతు' నని పోతన మహాకవి చెప్పినట్లుగా- రచయిత- నవలా, పద్య, గద్య, నాటక, సంభాషణాది పాఠకప్రియులందర్నీ మెప్పించే ప్రయత్నం చేసి, కృతార్థులయ్యారు. శ్రీకృష్ణకథను అన్నివర్గాలపాఠకులకూ సులువుగా అందించారు.

ఇందులో సందర్భోచితంగా ప్రాచీనమహాకవులపద్యాలతో పాటు-తిరుపతి వేంకటకవుల పద్యాల్నీ గ్రహించారు. కొన్నిచోట్ల ఆయాపద్యాల్లో చివరకొంత మార్పుచేస్తూ- తన దారిని పూలబాట, రాచబాట చేసుకొన్నారు.




నరకాసురుణ్ణి సంహరించిన తర్వాత శ్రీకృష్ణుడు సత్యభామతో కూడా ద్వారకను చేరుకోవడంతో ప్రారంభమై- కృష్ణుడు శిశుపాలుణ్ణి వధించి, విశ్వరూపం ప్రదర్శించడంతో శుభాంతమయ్యింది. మధ్యలో హంసడింభకుల్ని, జరాసంధుణ్ణీ వధించి, వధింపజేసిన ఘట్టాలూ ఉన్నాయి. రచన మొత్తం నాటకీయంగానే హృదయాన్ని హత్తుకొనే విధంగా సాగింది. హాస్యం, భక్తీ, ముక్తీ, ధర్మం కూడా చక్కగా సమన్వయాలై ప్రధానరసమైన వీరానికి పుష్టీ, తుష్టీ తెచ్చాయి.

సంబోధనల్లోని చమత్కృతి సహృదయాహ్లాదకమై పునఃపునః చదవాలనే ఆసక్తిని చిగిరింపజేస్తూంది.

రచయిత భారతం, భాగవతం, ఉత్తరహరివంశం- ఈ మూడింటి త్రివేణీసంగమాత్మకంగా-'నవల'ను రూపొందించడం గొప్పసాహసమే! రచయితకు భాష, శైలి, కవిత, భావనాపటిమ. అనేకగ్రంథపరిచయం, రచనానైపుణ్యం మొదలైనవి పటిష్ఠంగా, మనసునిండా మూర్తి మంతాలై ఉంటే - ఏ విజయమైనా రచించవచ్చు పాఠకలోకాన్ని మెప్పించవచ్చుననే ఒరవడిని- ఈ నవల నిరూపిస్తూంది.




ఈ నవలలో నాటకీయత పైచేయిగా రావడానికి కారణం ఈ రచయిత ముందుగానే దీనినే చలనచిత్రస్క్రిప్టుగా రాసిపెట్టడం. ఆ సంభాషణాత్మక శైలి అలాగే ఉంచి కేవలం సన్నివేశాల్ని సంధానం చేస్తూ తేటతెలుగులో నవలీకరించారు. అందువల్ల ఆ దృశ్యకావ్యలక్షణాలు అలాగే ఉండి పాఠకులకు చదువుతుంటే వెండితెరపై దృశ్యకావ్యాన్ని ప్రత్యక్షంగా వీక్షిస్తున్న రసానుభూతి కలుగుతుంది. దీనిలో ఉన్న మరో రహస్యమేమిటంటే-దృశ్యకావ్యంలో నవలా లక్షణాలు ఇమడవు. నవలలో దృశ్యకావ్య లక్షణాలు చక్కగా ఇముడుతాయి. ఈ రహస్యం తెలిసిన కవిసమ్రాట్ విశ్వనాథలాంటి మేధావులెందరో తమ నవలలను దృశ్యకావ్యలక్షణాలతో అలరింపచేశారు. డా॥వుయ్యూరు లక్ష్మీనరసింహరావు కూడా అదే ప్రణాళికలో ఈ పౌరాణిక నవలాదృశ్యకావ్యంలో ఈ లక్షణాల్ని ఇమిడ్చి పాఠకలోకానికి వినూత్ననవలను అందించారు.

ప్రత్యేకించి ఈ నవల వెండితెర కోసం అదనపు సన్నివేశాలు, సంభాషణలు, చిత్రవిచిత్రపాత్రలూ సృష్టించి వీరరసోత్తరంగా తీర్చిదిద్దినది. సాహితీ ప్రియులందరూ చదివి, ఆనందించదగిన మంచినవల - 'శ్రీకృష్ణభగవద్విజయము'.

*- డా॥ కంపల్లె రవిచంద్రన్.*





# జనవరి, 2018 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం–**వృత్తిపూర్వకంగా మంచిగుర్తింపు వస్తుంది. సమాజసేవచేసే అవకాశం దొరుకుతుంది. ఆర్థికంగా స్థిరత్వం. సంతానంపై శ్రద్ధ అవసరం. నూతనవస్తుభూషణాలు కొనుగోలు చేయుదురు. దానధర్మాలు అధికంగా చేస్తారు..



**వృషభం–**గుండె, ఉపిరిత్తులు శ్వాసకోశసంబంధ చికిత్సలు అవసరమౌతాయి, అయితే ఇబ్బంది లేదు. అరుణపారాయణవల్ల ఆరోగ్యసిద్ధి, వ్యాధి నివారణ. గృహనిర్మాణం ఆలస్యమౌతుంది. ధైర్యంగా కార్య నిర్వహణ చేస్తారు. సంతానవిషయాలు అనుకూలం.



**మిథునం–** శరీరసౌఖ్యం మానసిక ప్రశాంతత, సంఘంలో సన్మానాలు, గౌరవాలు కల్గుతాయి. కుటుంబం, సంతానంగురించి దిగులు. పనిఒత్తిడి తగ్గించుకునేందుకు శారీరకమానసిక మెరుగుదలకు యోగాభ్యాసంలాంటివి క్రమశిక్షణతో చేస్తారు.



**కర్కాటకం–** ఇతరుల గౌరవమర్యాదలకు ప్రాధాన్యత ఇస్తారు. భూమి కొనుగోలు చేస్తారు. ఋణబాధ చాలా తగ్గుతుంది. వ్యాపారవ్యవహారాల్లో విజయం సాధిస్తారు. కుటుంబాన్ని విజయపథంలోకి తీసుకువెడతారు. దూరప్రయాణాలు కలవు. విదేశీయానం కలసి వస్తుంది.



**సింహం–** వృత్తివ్యాపారాల్లో మార్పులు, పై అధికారులతో సత్సంబంధాలు కలిగి ఉంటారు. మన్ననలు పొందుతారు. ఇతరులకు మార్గదర్శకులౌతారు. ఆర్థికసమస్యలుండవు. దేవాలయసందర్శనార్థం దూరప్రయాణాలు చేస్తారు.



**కన్య –** ధనం చేతికి అందుతుంది. విద్యావ్యాసంగాల్లో అసాధారణప్రతిభాపాటవాలు ప్రదర్శిస్తారు. బహుమతులు గెలుచుకుంటారు. దూరప్రాంతాలను సందర్శిస్తారు. పనిఒత్తిడివల్ల ఉక్కిరి బిక్కిరి అవుతారు. సొంత పనులకు అవరోధం కలిగే అవకాశం ఉంది.



**తుల–**ఉన్నతచదువులకై దూరప్రాంతాలకు వెళ్లాలనే తపన ఉంటుంది. అదృష్టం కలసివస్తుంది. కొత్తవ్యాపారాల్లో లాభం అధికమౌతుంది. నూతనోత్సాహం వస్తుంది. విందువినోదాల్లో పాల్గొంటారు. చేసే వ్యాపారాలు కలసి వస్తాయి. అందరి ఆదరణకు పాత్రులవుతారు.



**వృశ్చికం–**చిత్తభ్రంశం, దుష్టులతో చేరడం, సొంత పనులకు ఆటంకం, ధనం ఖర్చగుట, దేశాంతర వాసం, అపోహలు చెందుట, సోదరులతో కలహం మొదలగు వాటినివారణకు సుబ్రహ్మణ్య ఆరాధన మంచిది. ధనవ్యయం అధికం.



**ధనుస్సు–** ఇతరులకు సహాయసహకారాలు అందిస్తారు. అద్భుతశక్తిసామర్థ్యాలు పొంది అన్నింటా విజయం సాధిస్తారు. చదువుల్లో రాణిస్తారు. క్రమశిక్షణతో వ్యవహరించి కార్యసాధన. కుటుంబంకోసం ధనవ్యయం. ధార్మికసంస్థలకు విరాళాలు అందచేస్తారు. దానధర్మాలు, పుణ్యకార్యక్రమాల్లో పాల్గొంటారు.



**మకరం–** నూతనగృహనిర్మాణప్రయత్నం చేస్తారు. వ్యాపారంలో ఆకస్మికధనలాభంతో ఋణబాధలు తొలగిపోతాయి. అనుకున్నవన్నీ సాధిస్తారు. విద్యావ్యాసంగాల్లో పాల్గొంటారు. బహుమతులు గెలుచుకుంటారు. వ్యవసాయరంగాలవారికి అధికలాభం.



**కుంభం–**ధనద్రవ్యలాభాలు, తనకు తోచిన సహాయం చేయడం, ఇంటిలో ఆనందకరవాతావరణం, ప్రతిదినమూ మధురపదార్థాలను తినడం, సిద్ధపురుషులను సేవించడం, స్థానచలనసూచనలున్నాయి. ఉద్యోగఉన్నతులు కలుగుతాయి. పనిఒత్తిడిని తగ్గించుకునే ప్రయత్నం చేస్తారు.



**మీనం–**కార్యక్రమాలు నిర్విఘ్నంగా సాగుతాయి. ఆర్థికస్థితి, నిర్వహణ బాగుంటుంది. ధార్మిక ఆధ్యాత్మికరంగాల్లోని ప్రముఖులు మిమ్ములను కలుస్తారు. ప్రయాణాలు అనుకూలం కాదు. వాయిదా వేయడం మంచిది. ఆంజనేయసంబంధధ్యానశ్లోకాలు పఠించండి.



ఇంటికి దీపం ఇల్లాలే

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

# సప్తగిరి



(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి & పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

(పిన్‌కోడ్ తప్పని సరి)

సెల్ నెం.

2. కావలసిన భాష :
☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం
☐ హిందీ ☐ ఆంగ్లం ☐ సంస్కృతం (సంవత్సరచందా మాత్రమే)

3. సంవత్సర/జీవిత చందా :
☐ రూ.60/- ☐ రూ.500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. :
తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :
తేది : చందాదారుని సంతకం

1) సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ.ను 'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి' వారిపేరున తీయాలి.

2) సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. ప్రధానసంపాదకకార్యాలయం, తి.తి.దే., తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.

3) మనిఆర్డరు పంపేవారు - అందులోనే మీచందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.

4) మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి. ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".

5) ఇతర వివరాలకు ఫోన్ నెం.0877-2233333, 2277777.

# వైకుంఠపాళి 25

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | 2 | | 3 | | 4 | | ■ |
| 5 | ■ | | ■ | | ■ | | ■ | 6 |
| 7 | | ■ | 8 | | | ■ | 9 | |
| | ■ | 10 | ■ | | ■ | 11 | ■ | |
| ■ | 12 | | | ■ | 13 | | | ■ |
| 14 | ■ | | ■ | 15 | ■ | | ■ | 16 |
| 17 | | ■ | 18 | | | ■ | 19 | |
| | ■ | 20 | ■ | | ■ | 21 | ■ | |
| ■ | 22 | | | | | | | ■ |

**నిర్వహణ** శ్రీ టి.ఎస్.జగన్మోహన్

## అడ్డం

1)కాళిదాసు రాసిన గ్రంథం(7); 7)రేయి(2); 8)స్నేహం(3); 9)ఆభరణం(2); 12)బాణం(3); 13)గరుడుడు(3); 17)సమూహం(2); 18)తిరుపతిలో ఈ దేవత జాతర సుప్రసిద్ధం(3); 19)ధూమం(2); 22)మాఘకావ్యం(7)

## నిలువు

2)దుర్గ(2); 3)శివుడు(4); 4)సంహారం(2); 5)భీముడు(3); 6)అందం(3); 10)వేదమాత(3); 11)ఇంద్రుడు(3); 14)కిరణం(3); 15)వసారా(4); 16)ఆకాశం(3); 20)తలక్రిందులైన చిలుక(2); 21)సైనికుడు(2)

జవాబులు ఈ సంచికలోనే ఉన్నాయి. అన్వేషించి... సరిచూసుకోండి.

- ప్రధాన సంపాదకుడు


Edited and published on behalf of T.T.Devasthanams by Dr. K.Radha Ramana, M.A., M.Phil., Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by Dr.T.Ravi, M.A., Ph.D., P.R.O. & Dy. E.O.,(Publications & Press)FAC, T.T.D. Press, Tirupati - 517507.

# వైకుంఠ ఏకాదశి ప్రత్యేకం! కేశవాది రూపాలు!!



21

### ఓం జనార్దనాయ నమః (చక్రం-శంఖం-గద-పద్మం)

సముద్రంలో ఉండి, తరచుగా దేవతల్ని పీడించే మధు, కైటభ, హయగ్రీవాది దైత్యులను మర్దనం చేసినవాడూ, మోక్షప్రదుడూ, జన్మలేనివాడూ, సంసార దుఃఖాన్ని పరిహరించేవాడూ, సుజీవులచేత పొందబడేవాడూ అయినందువల్ల శ్రీహరి 'జనార్దనుడ'య్యాడు. ఈ జనార్దనుడు గాయత్రిలోని "ప్ర" అన్న అక్షరానికీ, వాయుతత్త్వానికీ, కృష్ణపక్షంలో ఉదరం ఎడమభాగంలో ధరించేనామానికీ, ఉప్పుకూ, నైరుతిదిక్కుకూ నియామకుడు.



22

### ఓం ఉపేంద్రాయ నమః (గద-చక్రం-పద్మం-శంఖం)

ఇంద్రుడిని అనుజుడిగా పొందివున్నందువల్ల శ్రీహరి 'ఉపేంద్రుడు' అనబడుతున్నాడు.

ఈ ఉపేంద్రుడు గాయత్రిలోని "చో" అన్న అక్షరానికీ, తేజోతత్త్వానికీ, కృష్ణపక్షంలో ఎడమస్తనం మీద ధరించే నామానికీ, అరటిపండు, కొబ్బరికాయ మొదలైన ఫలాలకీ, వాటి రసాలకీ, తూర్పుదిక్కుకూ నియామకుడు.



23

### ఓం హరయే నమః (చక్రం-పద్మం-గద-శంఖం)

భక్తుల పాపాలను పరిహరించే వాడు కావడంచేత నారాయణుడు 'హరి' అనబడుతున్నాడు.

ఈ హరి గాయత్రిలోని 'ద' అన్న అక్షరానికీ, ఆపోతత్త్వానికీ, కృష్ణపక్షంలో ఎడమభుజం మీద ధరించే నామానికీ, తాంబూలానికీ నియామకుడు.



24

### ఓం కృష్ణాయ నమః (గద-పద్మం-చక్రం-శంఖం)

సృష్టి, స్థితి, సంహార నియమనాదుల వల్ల సకల జగత్తునూ తనలోనికి లాగికొనువాడూ, పూర్ణానంద స్వరూపుడూ, నీలవర్ణ దేహకాంతికలవాడూ అయినందువల్ల శ్రీహరి 'కృష్ణుడు' అనబడుతున్నాడు.

ఈ కృష్ణుడు గాయత్రిలోని "యాత్" అన్న అక్షరానికీ, పృథ్వీతత్త్వానికీ, కృష్ణపక్షంలో మెడమీద ధరించే నామానికీ, తాగేనీటికీ, దైహిక కర్మకూ నియామకుడు.

'24' Kesavadi Roopalu Oil Painting by P.Sivaprasad,TTD.1981-82

